శ్రీరస్తు

# శ్రీ ఆర్వేల

# అమాత్యశేఖరులు








గ్రంథకర్త:

యల్లంరాజు విజయరామయ్య

గుడివాడ. (కృష్ణాజిల్లా)

# అఖిలభారత అమాత్యశిరోమణుల
# శుభ సందేశములు.

GOVERNMENT OF INDIA.
VICE-PRESIDENT'S SECRETARIAT.

*Dated New Delhi, the 18, May 1955*

Dear Sir,

Thank you for sending me the two books which I read and enjoyed.

Yours faithfully,
(Sd.) *S. Radhakrishnan.*

Shri Yellamaraju Vijaya Ramaiah,
GUDIVADA. (Krishna Dt.)

---

MR. JUSTICE P. SATYANARAYANA RAO.
"Lakshmi" 32, Edward Elliots Road, Mylapore.

Dear Sir,

మీరు దయతో పంపిన గ్రంథము చదివితిని. మీరు ఎక్కువ కృషిచేసి చరిత్రాంశములను సేకరించి సులభశైలిలో గ్రంథము వ్రాసినందుకు చాలసంతోషమైనది.

Madras,
1-6-55.

Yours faithfully,
(Sd.) *P. Satyanarayana Rao*

## శ్రీ యల్లంరాజు విజయరామయ్యగారికి

ఆర్యా, నమస్కారములు.

మీరు పంపిన పుస్తకము చదివినాను, కాని శాఖోప శాఖలు కలసిపోవలసిన కాలము ఆసన్నమయిన ఈ రోజులలో ఇట్టిపుస్తకము వలన మేలుగలుగునా, అను విషయమే కొంచెం సందేహము గలుగునప్పటికి చారిత్రికముగ, కొన్ని విషయములు ఈ పరిశోధనవలన తేలగలవు అను మాట మాత్రము నిశ్చయము. ఈ దృష్టితో చూచి చదివెడి వారలకు కొంత ఉత్సాహము ఆనందమును గలిగింపగలదు.

పచ్‌మాడి,
మధ్యప్రదేశ్
12-6-1955.

(Sd.) భో॥ పట్టాభిసీతారామయ్య.
మధ్యప్రదేశ్ గవర్నరు

---

## ఆంధ్ర పత్రిక అభిప్రాయము.

దీనిలో పూర్వకాలంలోను, నేటి కాలంలోను ప్రసిద్ధులయిన శ్రీ ఆర్వేల అమాత్యశేఖరుల జీవిత చరిత్రలు కొన్ని గలవు. ఈ అమాత్య శేఖరులలో అనేకులు నేటి ఆంధ్రాభ్యున్నతికి పట్టుగొమ్మలు.



# శ్రీ ఆర్వేల అమాత్యశేఖరులు



కొందఱు దీనపోషకులు కొందఱుసర్వకళావిశారదుల్
కొందఱుధర్మవర్తనులు కొందఱుసూనృతవాక్యవర్తను
ల్గొందఱు రాజపాలకులు కొందఱు కర్మకలాప్రదీపకు
ల్గొందఱుభాగ్యశీలురొక కొందఱుసత్కవులందఱందఱే




గ్రంథకర్త :

## యల్లంరాజు విజయరామయ్య

గుడివాడ. (కృష్ణాజిల్లా)



గుడివాడ, శ్రీ రామా ప్రెస్‌నందు ముద్రింపబడినది.

సర్వస్వామ్య సంకలితం ] 1954 [ వెల 1-2-0

# విషయసూచిక



విషయములు — పుట

విషయములు　　　　　　　　　　　　　　　　　　　　　　　　పుట

REHBOAT170



విషయములు పుట

కం॥ ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకంబనంగ బ్రజ్ఞయచుమ్మీ
ప్రజ్ఞయ కైవల్యంబును,
బ్రజ్ఞా సాధ్యములుగాని పనులుంగలవే॥

# విజ్ఞాపన

జగద్విఖ్యాతిగన్న యుగంధర, చాణిక్య, భాస్కర, తిక్కన, పోతనామాత్య శేఖరులు జన్మించిన, సుప్రసిద్ధ, నియోగిశాఖ, బ్రహ్మవంశములో, ఎట్లేర్పడ గలిగినది. మంత్రి శబ్ద గృహనామముచేతను, రాజుశబ్ద గృహనామముతోడను, నియోగులు ఎందుకు, వ్యవహరింపగలుగుచుండిరి, మొదలగు, హంశములు ప్రబోధించు గ్రంథరాజములను, విద్వచ్ఛిఖామణు లెవ్వరు రచించియుండలేదు.

ఈర్ష్యా పరులు కొందరు, నియోగిశాఖ, యశశ్చంద్రి కలను కొంచపరుచుటకు పుక్కిటి పురాణకథలను, సృష్టిజేసి, గ్రంథములను, రచించగలిగిరి. అట్టి విధముతో రచించిన, గ్రంథములు, అభూతకల్పనలని, నిరూపింప జేయబడుటకు, స్మృతివచనములను పొందుపరచి "ఆర్వేల అమాత్య శేఖరులు" అను నామముతో, నొక గ్రంథము, రచించి నియోగిశాఖ, సత్సంప్రదాయములను, భారతావనికి నివేదించితి.

ఇట్లు,
యల్లంరాజు విజయరామయ్య.

# అంకితము



గీ॥ అక్షరంబు వలయు గుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వాకిచ్చు రసము,
అక్షరంబు తన్ను రక్షించు గావున
నక్షరంబు, లోక రక్షితంబు.

అట్టిలోక రక్షితంబైన, అక్షర గుచ్ఛములతో, ఆర్వేల అమాత్య శేఖరుల సచ్చరిత్రను పొందుబరచి, మద్ జన్మస్థానమైన తమిరిశ గ్రామమునం దవతరించిన శ్రీకృష్ణపరమాత్ముని పాదములయం దీ చిన్ని పొత్తము మద్భక్తితో నర్పించితి.

ఇట్లు,

యల్లంరాజు విజయరామయ్య.

శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు.

# ఆర్వేల అమాత్య శేఖరులు



క॥ నను కరుణింపుము మురహర
వనజాయత పత్రనేత్ర వారిజనయనా
సనకాది మౌనిసేవిత
ఘన తమరిక గోపబాల కరుణాశీలా॥



శ్లో॥ అరాజకేహిలోకేస్మిన్ సర్వతో విద్రుతే భయాత్ ।
రక్షార్థమస్య సర్వస్య రాజానమసృజత్ప్రభుః ॥

లోకమందు రాజు లేకపోయిన బలముగలవాని చేత బలములేనివాడు బాధింపబడును. కావున ఈ లోకమంతయు రక్షింపక యుండుకొరకు ఈశ్వరుడు రాజును సృజించెను.

శ్లో॥ యదాస్వయంనకుర్యాత్తు నృపతిః కార్యదర్శనమ్ ।
తదానియుంజ్యాద్విద్వాంసం బ్రాహ్మణం కార్యదర్శనే ॥

రాజు స్వయముగా కార్యములను నిర్వహింపజాలనప్పుడు రాజ్యాంగ వ్యవహారముల కొరకు పండితుడైన బ్రాహ్మణుని నియోగించవలెను. —మనుస్మృతి

రాజ్యాంగ వ్యవహారములు నియోగించుటను నేర్పడిన వాడగుటచేత నతడు నియోగిగా నెన్నబడెను. నియోగి అన మంత్రి.

శ్లో॥ సర్వేషాంతు విశిష్టేన బ్రాహ్మణేన విపశ్చితా
మంత్రయేత్పరమంమంత్రం రాజాషాడ్గుణ్యసంయుతమ్॥

మంత్రులలో నుత్కృష్టుడుగాను, పండితుడుగాను నుండెడు బ్రాహ్మణమంత్రితో శత్రువును సమాధానపరచుట ఎదుర్చుట యుద్ధమునకుబోవుట సమయముజూచుట పగవాని సేనలను కలతపఱచుట తానొకని శరణుజొచ్చుట యీ యాఱింటిని రాజు యోచింపవలయును.

శ్లో॥ నిత్యంతస్మిన్ సమాశ్వస్తః సర్వకార్యాణి నిక్షిపేత్
తేనసార్ధం వినిశ్చిత్యతతః కర్మసమారభేత్॥

ఆ బ్రాహ్మణమంత్రితో ప్రతిదినమును నమ్మికగలవాడై సమస్తమునుజెప్పి వానితో యోచించి ప్రతి కార్యమును నారంభించవలెనని మనువు శాసించియుండెను.

రాజు, రాజ్యము ఏనాటినుంచి భారతావనిలో నేర్పడి యుండగలిగినదో ఆనాటినుంచియే బ్రాహ్మణ వంశస్థులు మంత్రిపీఠములను అలంకరించి యుండినట్లు విదితమగుచున్నది.



# మంత్రిశబ్ద గృహనామము నియోగులపట్ల ఎందుకు వాడుచుండిరి



గీ॥ భాగ్యవశమున, బుద్ధిసంపన్నుడగును
బుద్ధిబలమున, నృపులను బూజ్యుడగును
నృపులుమన్నింప, నయకళా నిపుణుడగును
ఘని రాజ్యమునకుప ప్రధానుడగును॥



మను శాసనమునుబట్టి మంత్రినస్యులుగా నేర్పడియుండిన బ్రాహ్మణశ్రేష్ఠులు మంత్రిపీఠము అలంకరించి రాజ్యపాలన నొనర్చియుండిన మంత్రిశేఖరులకు మంత్రిప్రగడయని, మల్లాప్రగడయనియు, మానాప్రగడయనియు యల్లాప్రగడయనియు యర్రాప్రగడయనియు, తల్లాప్రగడయనియు, చన్నాప్రగడయనియు, చిట్టాప్రగడయనియు, లక్కాప్రగడయనియు, వెంట్రప్రగడయనియు, రెబ్బాప్రగడయనియు, పోలాప్రగడయనియు, బొల్లాప్రగడయనియు, అన్నాప్రగడయనియు, ఈశ్వరప్రగడయనియు అక్కనప్రగడనియు విస్సాప్రగడనియు బుయ్యనప్రగడనియు, శంకరప్రగడనియు, కీసాప్రగడనియు, ధరణిప్రగడనియు, పేరాప్రగడనియు, యిత్యాది బిరుదావళులు కొందరు నియోగి వంశస్థులు వహించి యుండుటచేత మంత్రిశబ్దము వారి వారి గృహనామములుగా నీ రాజ్యమ్ల బడుచున్నవి.

# రాజుశబ్ద గృహనామము నియోగి వంశస్థులకు ఎట్లు రాగలిగినది



శ్లో॥ అమాత్యముఖ్యం ధర్మజ్ఞం ప్రాజ్ఞం దాంతం కులోద్గతం
స్థాపయేదాసనేతస్మిన్ ఖిన్నః కార్యే క్షణేనృణాం॥

రాజు తానుగానే కార్యవిచారణ చేయుటకు కష్టమైన సమయమందు మంత్రిని సింహాసనమందుంచి రాజ్యపాలన మొనర్చవలసినదిగా మనువు శాసించెను.

మను శాసన ప్రకారము పెక్కండ్రమాత్యశేఖరులు రాజ్యసింహాసన మధిష్ఠించి రాజాధిరాజులు గాంచగలిగెడి రాజ బిరుదావళులు నొందగలిగిన దేశనామామాత్యుని గృహనామమును దేశరాజు అనియు, భోగనామామాత్యుని గృహనామమును భోగరాజు అనియు, సింగనామాత్యుని గృహనామమును సింగరాజు యనియు, పోతనామాత్యుని గృహనామమును పోతరాజు యనియు, యల్లంనామాత్యుని గృహనామమును యల్లంరాజు యనియు, గోపనామాత్యుని గృహనామమును గోపరాజు యనియు, గోవిందనామాత్యుని గృహనామమును గోవిందరాజు యనియు, తిమ్మనామాత్యుని గృహనామమును తిమ్మరాజు యనియు, బసవనామాత్యుని గృహనామమును బసవరాజు యనియు, కొమ్మనామాత్యుని గృహనామమును కొమ్మరాజు యనియు, లక్కనామాత్యుని

గృహనామమునకు లక్ష్మరాజు యనియు, సీతంనామాత్యుని
గృహనామమునకు సీతంరాజు యనియు, మాదినామాత్యుని
గృహనామమునకు మాదిరాజు యనియు, పెమ్మనామాత్యుని
గృహనామమునకు పెమ్మరాజు యనియు, దామనామాత్యుని
గృహనామమునకు దామరాజు యనియు, మాచినామాత్యుని
గృహనామమునకు మాచిరాజు, యనియు, సోమనామాత్యుని
గృహనామమునకు సోమరాజు యనియు. అగస్త్యనామాత్యుని
గృహనామమునకు అగస్త్యరాజు యనియు, శ్రీగిరినామాత్యుని
గృహనామమునకు శ్రీగిరిరాజు యనియు, కోటంనామాత్యుని
గృహనామమునకు కోటంరాజు యనియు, నీలంనామాత్యుని
గృహనామమునకు నీలంరాజు యనియు, అన్నంనామాత్యుని
గృహనామమునకు అన్నంరాజు యనియు, భావనామాత్యుని
గృహనామమునకు భావరాజు యనియు, బుధనామాత్యుని
గృహనామమునకు బుధరాజు యనియు, గంగనామాత్యుని
గృహనామమునకు గంగరాజు యనియు, సత్తినామాత్యుని
గృహనామమునకు సత్తిరాజు అనియు, ద్రోణనామాత్యుని
గృహనామమునకు ద్రోణరాజు అనియు. మంచినామాత్యుని
గృహనామమునకు మంచిరాజు యనియు, తాతినామాత్యుని
గృహనామమునకు తాతిరాజు యనియు, కాసినామాత్యుని
గృహనామమునకు కాసిరాజు యనియు. సామనామాత్యుని
గృహనామమునకు సామరాజు యనియు, గాదినామాత్యుని
గృహనామమునకు గాదిరాజు యనియు, వేమనామాత్యుని
గృహనామమునకు వేమరాజు యనియు, కేసినామాత్యుని

గృహనామముకు కేసిరాజు యనియు, అంకంనామాత్యుని
గృహనామముకు అంకంరాజు యనియు, పెద్దినామాత్యుని
గృహనామముకు పెద్దిరాజు యనియు, దొంతనామాత్యుని
గృహనామముకు దొంతరాజు యనియు, కొమర్రామాత్యుని
గృహనామముకు కొమర్రాజు యనియు, నందినామాత్యుని
గృహనామముకు నందిరాజు యనియు, కామనామాత్యుని
గృహనామముకు కామరాజు యనియు, అక్కినామాత్యుని
గృహనామముకు అక్కిరాజు యనియు, భద్రినామాత్యుని
గృహనామముకు భద్రిరాజు యనియు, అయ్యలనామాత్యుని
గృహనామముకు అయ్యలరాజుయనియు, శాతంనామాత్యుని
గృహనామముకు శాతంరాజు యనియు, శీతినామాత్యుని
గృహనామముకు శీతిరాజు యనియు, దండెంనామాత్యుని
గృహనామముకు దండెంరాజు యనియు, రామనామాత్యుని
గృహనామముకు రామరాజు యనియు, నారపనామాత్యుని
గృహనామముకు నారపరాజు యనియు, సూరపునామాత్యుని
గృహనామముకు సూరపురాజు యనియు, దుగ్గనామాత్యుని
గృహనామముకు దుగ్గరాజు యనియు, మల్లపునామాత్యుని
గృహనామముకు మల్లపురాజు యనియు, ముత్తనామాత్యుని
గృహనామముకు ముత్తరాజు యనియు, కనవనామాత్యుని
గృహనామముకు కనవరాజు యనియు, వేగనామాత్యుని
గృహనామముకు వేగరాజు యనియు, యిత్యాది రాజబిరుదా
వళులు, రాజ్యమేలిన అమాత్యశేఖరులు బడయుటచేత రాజు
శబ్దము గృహనామముగా నియోగివంశస్థులను నేర్పడగలిగినది.

——(o)——

# గ్రామనామములు గృహనామములుగా నియోగులకు, ఎట్లు నేర్పడగలిగినవి.



ప్రాచీన కాలమునాటి అమాత్య శేఖరుల చరిత్రలు అద్భుతములు. వారి ప్రజాసేవ అప్రతిమానము. వారి దాతృత్వమునకు మితిలేదు. వారి పాలనలో నొసంగియుండిన ఈనాములను, అగ్రహారములకు అంతులేదు. వారి కీర్తి చంద్రికలు పుడమినెల్లడను నలుముకొని తేజోరూపము దాల్చినవి. దేశ ప్రజలు వారిపట్ల కృతజ్ఞత దెల్పుటకొరకు అమాత్య శేఖరుల నామములచేతను, వారి వారి గ్రామములకు పల్లెలకు నామములను నేర్పరుచుకొనగలిగియుండిరి. ఆ హేతువుచేతను గ్రామనామములు గృహనామములుగా నియోగి వంశస్థులకు నేర్పడగలిగినవి.

—(o)—

చ॥ పలుకక యుండుకంటె దగ ।
బల్కుటమేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమున ।
బల్కుట సర్వజన ప్రియంబుగా
బలుకుటమోలి నెక్కుడగు ।
భంగులు వీని నెఱింగియుండు మై
బలుకక నాల్గు చందముల ।
బల్కగ మెత్తురు వాని దేవనల్.

# బ్రాహ్మణులు సేనాధిపత్యము రాజ్యాధిపత్యము వహించవచ్చునా?



శ్లో॥ అగ్రతశ్చతురో వేదాః పృష్ఠతస్సశరంధనుః
ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్రం శాపాదపి శరాదపి॥

ముందు ఋగ్యజుస్సామాథర్వణములు నాలుగు ప్రాం జదువులును, వెనుక దూపులతోడి పల్లు శాపమును శక్తివల్ల నిది బ్రాహ్మణధర్మము కైమునతోడి కర్జమువల్ల నిది క్షత్రియ ధర్మము ఈరెంటను తాను సమర్థుండని మున్ను పరశురాముడు చాటియుండెను. బ్రాహ్మణ క్షత్రియాధికారములు రెండును భూసురులను గలవని అథర్వణవేదము చెప్పుచున్నది.

శ్లో॥ సైనాపత్యంచ రాజ్యంచ దండనేతృత్వమేవచ
సర్వలోకాధిపత్యంచ వేదశాస్త్ర విదర్హతి॥

సేనాధిపత్యము, దేశాధిపత్యము, న్యాయాధిపత్యము అఖండ మండలాధిపత్యము అను నుద్యోగములకన్నిటికిని వేద శాస్త్రవేత్తయే తగినవాడని, మనువు నిర్ణయ మొసంగి యుండెను.



క॥ ధర్మంబున సర్వంబగు
ధర్మంబున సుఖము గలుగు ధర్మముచే
సత్కర్మంబులు ఫలియించెడి
శర్మకరా జగము ధర్మసారంబే కదా॥

# ప్రజాసేవ యొనర్చుటకొరకు గ్రామ కరిణీకోద్యోగములను అమాత్యశేఖరుల కుటుంబములవారు స్వీకరించిరి.



ప్రభుత్వపాలనకు ప్రథమ సోపానము గ్రామము, అట్టి గ్రామపాలన సక్రమంగా నిర్వహింపగలిగిననాడే ప్రభుత్వ పాలన నిరాటంకముగ కొనసాగుచున్నది ప్రభుత్వపాలన నిరాటంకముగ కొనసాగుటకు విజ్ఞాన సాంప్రదాయములును, సాహసాది సద్గుణములుగలిగి నిష్కళంక ప్రవర్తనతో గూడిన ఉద్యోగులు ప్రతిగ్రామమును నేర్పడియుండినయెడల ప్రజలకు ప్రభుత్వమునకు శ్రేయోదాయకము నేర్పడుచున్నది. అట్టి శ్రేయోదాయకము ప్రజలపట్లను, ప్రభుత్వమునెడలను చిర స్థాయిగా ఏర్పడుటకొరకు శ్రీ గోపరాజు రామప్రధానిగారు సంకల్పించుకొనబడి నిర్దాక్షిణ్యములతో అవినీతి చర్యలతో ప్రజలను హింస పెట్టగలుగుచున్న కరిణీకోద్యోగులను తొల గింప జేయగలిగియుండిరి.

గ్రామకరిణీకోద్యోగములు అమాత్యశేఖరుల కుటుంబముల వారికి నొసంగియుండినయెడల దీనజన సంరక్షణయందును దేవ మాన్య నిర్వాహణపట్లను, ప్రజల సస్యసంపదభివృద్ధినెడలను కంటికిరెప్పవలె అహర్నిశాదులు దోడ్పడి గ్రామపాలన పునా దులు ప్రతిభావంతములుగానొనర్చి ప్రజాసేవ యొనర్చగలుగు దురని శ్రీరామప్రధానిగారు గుర్తెరింగి గ్రామకరిణీకోద్యోగ

ములు అమాత్యశేఖరుల కుటుంబములైన నియోగివంశస్థులను నొసంగియుండిరి.

గ్రామ కరిణీకోద్యోగములను నియోగి వంశమువారు స్వీకరించి అత్యంతాకర్షణీయులైన ప్రతినిధులవలె వారి వారి విద్యుక్త ధర్మములను సక్రమంగా నిర్వహించు కొనగలిగి సందుకు గ్రామప్రజల జోహార్లను ప్రభుత్వమువారిమన్ననలను బడయగలిగియుండిరి. భవిష్యత్తు గ్రామపాలన నిర్వహణను అమాత్యశేఖరుల వంశీయులు అర్హులై యుండగలుగుదురని గ్రామకరిణీకోద్యోగులను వంశపారంపర్య వారసత్వపుహక్కులు స్వదేశరాజులు నేర్పరచజేసిరి. అటుపిమ్మట బ్రిటను ప్రభుత్వం గూడ గ్రామ కరిణీకోద్యోగుల ప్రాజ్ఞతా విశేషంబులు నెరింగి శాసన సభలలో గ్రామోద్యోగులను వంశ పారంపర్యంగా వారసత్వపు హక్కులను చట్టములను జేయించి గ్రామోద్యోగులను బ్రిటను ప్రభుత్వము గౌరవింపజేయగలిగినది. ఆంధ్ర దేశములో నేటికిని అమాత్యశేఖరుల కుటుంబములవారైన నియోగులు గ్రామకరిణీకోద్యోగములను నిర్వహించగల్గుతూ తొల్లింటి తమ పూర్వౌన్నత్యమునకు కళంకము రానివ్వకుండా మహోత్కృష్టమైన ప్రజాసేవ యొనర్చగల్గుచుండిరి.

---

సీ॥ తనకీర్తి యాచంద్రతారార్కముగ మంత్రి
కులులకుఁ గరణికముల నొసంగె
నతిథిసంతర్పణ మనుదినంబు నొనర్చి
ఖ్యాతిగా హరిహర ప్రీతిఁజేసె

వర్ణాశ్రమాచార నిర్ణయంబులనెల్ల
వేదోక్తరీతిగా వెలయఁజేసి
ఘనవిప్రవందిమాగధ కవీంద్రులనెల్ల
నగ్రహారములిచ్చి యాదరించె

గీ॥ నతఁడు శ్రీగోపరాజాన్వయాబ్ధి చంద్రు
డనఁగ విలసిల్లెఁ దనసాటి ఘనులుపొగడ
మంత్రి దేవేంద్రుఁడనఁగ స్వతంత్రలీల
మంత్రికులహేళి రామయామాత్యమౌళి.

సీ॥ వీఁడెపో! దుష్టారి వీరమంత్రి కఠోర
భూధరంబులకు దంభోళిధార
వీఁడెపో కవిరాజ గాఢదారిద్ర్యాంధ
కారంబులడఁగించు కమలహితుఁడు
వీఁడెపో బహునీతి విద్యానిరూఢిచే
సురగురుఁ గెల్చిన శుభకరుండు
వీఁడెపో చతురబ్ధివేష్టితావనిఁ గల్గు
బహుమంత్రి కులసార్వభౌమమూర్తి

గీ॥ ఈతఁడే సర్వదేవతా ప్రీతికరుఁడు
ఈతఁడే గోపరాట్కుల శీతభానుఁ
డని కవీంద్రులు పొగడంగ నతిశయిల్లె
మంత్రి జంభారిరామయామాత్యశౌరి.



# ఆర్వేల నియోగులని ఎట్లు పేర్గాంచియుండిరి

భారతదేశము హిందూచక్రవర్తుల పాలనక్రింద నేర్పడి యుండినపుడు మంత్రిపీఠము అలంకరించియుండిన అమాత్యశేఖరులు కొందరును ఉపకార వేతనమునములను గైకొనుచుండిన మంత్రివర్యులు మరికొందరును కలిసి ఆర్వేల అమాత్యశేఖరులు బ్రహ్మవంశమువారుగలరని జనాభా లెక్కలపట్టికలనుండి గుర్తించబడినది.

అట్టి ఆర్వేల అమాత్యశేఖరులకే ఆర్వేల నియోగులని మరియొకనామము మనుస్మృతి సృజించగలిగినది. నియోగి అన మంత్రి, అమాత్యశేఖరుడు. (మనుస్మృతి)

ఆర్వేల నియోగులు, ఆర్వేల అమాత్యశేఖరులు బ్రహ్మవంశమునందు ఆర్వేల అమాత్యశేఖరులుద్భవించగల్గుట చేత అట్టి ఆర్వేల అమాత్యశేఖరులకే ఆర్వేల నియోగులుగా పేర్గాంచియుండిరి.

---

గీ॥ గుణవిహీనుడు సామ్రాజ్య గురుతుగన్న
వసుధ వానికి స్థిరగౌరవంబురాదు
ధరణిలోపల దారిద్ర్య దశనుగన్న
గలుగు గుణవంతునకె స్థిరగౌరవంబు.

# దేశపాండ్య దేశముఖ్ బిరుదములు నియోగులకు ఎట్లు లభించబడ్డవి

ప్రాచీనకాలమున స్వదేశరాజుల పాలనయందు శాసనసభలకు బదులు రాజుతోగూడిన రాజ్యాంగసభలు నేర్పడియుండగలిగెడివి.

ఆ రాజ్యాంగ సభలకు నొక్కొక్క దేశముతరఫున నొకరిద్దరు నియోగివంశమువారు రాజుసభలకేగి దేశప్రజల అభీష్టములను రాజుసభవారికి నివేదించి దేశప్రజల వాంఛితములను నెరవేర్చుచుండెడివారు.

దేశప్రజల వాంఛితములను అట్లు నెరవేర్చుచుండెడి దేశసేనాగ్రేసరులైన నియోగి వంశమువారికి దేశపాండ్య దేశముఖ్ బిరుదములను స్వదేశరాజులొసంగి నియోగి వంశీయుల ప్రజాసేవను కొనియాడగల్గియుండిరి. నేటికిని నియోగి వంశమునందు దేశపాండ్య, దేశముఖ్ బిరుదములతో కొందరు వ్యవహారింపగలుగుచుండిరి.

---

కం॥ తగునిది తగదని యెదలో
నగవక సాధులను బేదవారలకెగ్గున్
మొగిజేయు దుర్వినీతుల
కగునని మిత్తాగమంబులైన భయంబుల్.

# ద్రోణవంశీయులు - ఆదిరాజువారు

బ్రహ్మవంశమువారు సేనాధిపత్యము రాజ్యాధిపత్యము వహింపవచ్చునని స్మృతులు చెప్పుచున్నవి. ఆ హేతువుచేతనే వేదశాస్త్ర వేత్తయైనట్టియు, భారద్వాజ గోత్రోద్భవుండైన ద్రోణుని సర్వ సేనాధిపతిగా భారత యుద్ధమున నియమింప జేసిరి.

ద్రోణుండు ధనుర్బాణముధరించి భార్గవరామునికైవశి. రాజాధి రాజులను సైతము రణరంగమున పారద్రోలి క్షాత్రధర్మము విప్రవంశమున ఆదినే బ్రతిష్ఠింపజేయగలిగిన ద్విజరాజ వరేణ్యుండగుటచే భారద్వాజ గోత్రోద్భవుడైన ద్రోణవంశీయుల గృహనామము ఆదిరాజు యని పిలువబడుచుండిరి, నియోగి కుటుంబమునందు భారద్వాజ గోత్రోద్భవులైన ఆదిరాజువారుగలరు.

---

క॥ సిరిగలవానికిఁ జెల్లును
దరుణులు పదియారు వేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా గంగవిడుము పార్వతిచాలున్

# తొగరుచీటి రాయన భాస్కరమంత్రి
# నందవరీక నియోగి



నందవరీకనందనను నందవర అగ్రహారమును బడయ గల్గుటచేత నందవరీకులని గ్రామనామమును రాయనమంత్రి భాస్కరుడు నేర్పరచుకొనగ గల్గియుండెను.

సీ॥ ఉత్తుంగభుజసూను దత్తనందాపురీ
  పుణ్యాగ్రహారాంశ భోక్త యితఁడె
ఆజన్మసంసిద్ధ భూజనప్రఖ్యాత
  దానసింహాసనాధ్యాసి యితఁడె
కొండపల్లీ రాజ్య మండలాఖిలమహా
  గణకసందోహాగ్ర గణ్యుడితఁడె
వైకుంఠతీర్థనిర్వాణ సంయమికృపా
  సంవర్ధితాఖిలైశ్వర్యుఁ డితఁడె

గీ॥ కొండవీ డుద్దగిరి పెనుగొండ గుత్తి
పానుగల్వి జయనగర పట్టణముల
యర్థులకునిచ్చు నితఁడె యిష్టార్థ మనుచు
జగము రాయనభాస్కరుఁ బొగడఁ బొగడు.

సీ॥ రంగత్కృపాదృష్టి గంగాభవానికి
  మణికంకణంబు లేమంత్రిమొసఁగె
భిక్షార్థ మిలాయఁగా నక్షయంబగునట్లు
  మార్తాండుఁ డర్ఘ మేమంత్రి కొసఁగెఁ

దగ. వేఁడినంతలో జగతిపై నర్థికి
మానంబు ప్రాణ మేమంత్రి యొసఁగె
మానంబు తాకట్టువేసి పదార్థంబు
మహిమచే నర్థి కేమంత్రి యొసఁగె

గీ॥ అతఁడు నందవరీక నరాన్వయుండు
దుర్ఘటుండు వసిష్ఠ గోత్రోద్భవుండు
శత్రు మథనుండు వినుకొండ శాసనుండు
భవ్యభరతుండు రాయనిభాస్కరుండు.

రాయన భాస్కరమంత్రి తొలుదొల్త వినుకొండకు కరణంబుగాయుండి యవ్వినుకొండ సంస్థానాధీశ్వరుండైన శ్రీ కోన బుద్ధారెడ్డియను లోకైక దాన ప్రతాప కీర్తిచంద్రుని కడ మంత్రిత్వ ధురంధరుండై దానకర్ణుండని ప్రసిద్ధినొందె. ఆ మంత్రి శేఖరుని తనయునితోబాటు నొక భట్టు చిన్న వానికి బాల్యమునుండియు సకలవిద్యలను గఱపించి వివాహాది కార్యము లొనర్చ జేసెను. నంతట నా భట్టుకవి భాస్కర మంత్రినిగని ఓ మంత్రిశేఖరా! మీ కీర్తి చంద్రికలు దేశ దేశంబులయందును, వ్యాపింప జేసినగాని నాకృతజ్ఞత తెల్లంబు గా నేరదనియు విన్నవించి భాస్కర మంత్రివద్ద శెలవుగైకొని ఆనెగొందె యందుగల జగదేక విఖ్యాతిగాంచిన శ్రీకృష్ణ దేవరాయలవారి సందర్శన మొనర్చగలిగెను.

అంతట శ్రీకృష్ణదేవరాయలు భట్టుకవినిగాంచి నీవెవ్వరి ఆస్థాన కవీశ్వరుండవు అని ప్రశ్నించినమీదట భాస్కరమంత్రి

ఆస్థాన కవీశ్వరుండనని భట్టుకవి చెల్పబడగ ఆ భాస్కరమంత్రి నెంతటివాత, ఆ మంత్రిపైన నీవు రచించిన పద్యంబులను వచించవలసినదిగా శ్రీకృష్ణదేవరాయలు భట్టుకవికి దెలిపెను. సంతట భట్టుకవి

క॥ వగమాన్ప యర్థి కియ్యని
మగముండకు మీసమేల మరి మూతిపయిం
దెగ గొరగడాయె మంగలి
రగడంమున గీర్తి దోచ రాయని బాచా.

క॥ పసముత్య మొకటిచాలును
గసవూడ్చిన చింపిరాలు గంపెండేలా?
రసికుం డొకడె చాలును
రసహీనులు పదువురేల రాయన బాచా॥

అని పద్యంబులు భట్టుకవి చదువగానే శ్రీకృష్ణదేవరాయలు మిక్కిలి ఆగ్రహచిత్తులై ఏమీ భూమీ స్థలంబున మీ భాస్కరమంత్రిగాక ఇతరులు మగముండలేనా యని ఆ భట్టుకవిని గారాగృహంబున బడవేయుడని చెప్పినంతనే రాయలవారి అస్థానభట్టుకవి శ్రీకృష్ణదేవరాయలవారి సన్నిధికి నరుదెంచి యో రాజేంద్రా యిది యెక్కడి ధర్మం. ఆశ్రిత కృతులందినవారు మంత్రులుండగా నర్థి ప్రవర్తనంబున నెట్టి వారినైన నీయంతటివాడు లేరని వర్ణించుచు, వారిచ్చిన సంతో సించుచు నీయకుండిన నిరసించు యాచకునిదేనా నేరము

మరియు నా దాతకంటె మిక్కిలి యొసంగినవారిపై నంతకంటె విశేషంబుగా కృతులురచించెదరు అని ప్రార్థించగా

ఆ భట్టుకవిని గారా గృహమునందు వేయక, శ్రీకృష్ణదేవ రాయలవారి సన్నిధియందు యుండగలుటకు ఆజ్ఞాపింపబడెను. హరిశ్చంద్రుని భాంకింప జేయించుటకు ఎన్ని అవాంతరములు విశ్వామిత్రుడు దెచ్చిపెట్టియుండెనో అట్లే శ్రీకృష్ణదేవరాయలు భాస్కరమంత్రియొక్క దాతృత్వముపట్ల నన్నెపరీక్ష జేయ దలపెట్టి, తన ఆస్థానమందుగల నొక భట్టుకవిని రావించగలి వినుకొండయందుగల భాస్కరమంత్రియొక్క దానశీలనకు సంతరాయములు కల్పించవలసినదిగా ఆనతిచ్చెను.

భట్టుకవి వినుకొండకునేగి భాస్కరమంత్రినిగాంచి యో మంత్రిశేఖరా! దానశాధేయ అని కైవారము జేసి,

ఉ॥ ఒక్కఁడు మాంసమిచ్చె మఱి ♦ యొక్కఁడు చర్మముఁ
గోసియిచ్చె వే
ఱొక్కరుఁ డస్థినిచ్చె నిఁక ♦ నొక్కఁడు ప్రాణములిచ్చె వీరిలో
నొక్కొకపట్టునన్ బ్రతుక ♦ నోపక యిచ్చిరొ? కీర్తికిచ్చిరో?
చక్కఁగజూడు మంత్రిఁల ♦ సంభవ రాయనమంత్రిభాస్కరా.

అని భాస్కరమంత్రిపై పద్యము జదివిన ఆభట్టుకవిని భాస్కరమంత్రి విలోకించి నీవు నేమి కావలెనో నిచ్చెద కోరుమని భట్టుకవికి దెలిపెను. అంతట భట్టుకవి ఖడ్గముతో నొక్కపోటు భాస్కరమంత్రిని పొడువవలెననికోరగా అందుకు భాస్కరమంత్రి సమ్మతించెను.

భట్టుకవి శ్రీకృష్ణదేవరాయలు వద్దను నేగి తానుకోరిన ప్రకారము ఖడ్గముతో తనను పొడచుకోవచ్చునని మంత్రి భాస్కరుడు దెలిపినట్లు నెరింగించెను. అంతట శ్రీకృష్ణదేవరాయలు యవ్వినుకొండ సంస్థానాధీశ్వరుండైన కోన బుద్ధారెడ్డి గారికి నొక జాబువ్రాసి ఆ జాబులో మీమంత్రి భాస్కరుడు తననుఖడ్గముతో పొడచుకొనవలసినదిగా భట్టుకవికి వాగ్దానము జేసినట్లును, ఆ వాగ్దానము చెల్లించుటయందు మధ్యవర్తిగా కోన బుద్ధారెడ్డిగారు యుండవలసినదని శ్రీకృష్ణదేవరాయలు దెలిపియుండెను.

శ్రీ కోన బుద్ధారెడ్డిగారు మంత్రి భాస్కరుని రావించ గల్గి, భట్టుకవికి యొసంగియుండిన వాగ్దానముసంగతి దెలుప బడగా ఆ వాగ్దానమునకు భంగము యుండదనియును భట్టుకవి ఖడ్గముతో తనను పొడవవచ్చునని శ్రీకృష్ణదేవరాయలకు దెలుపవలశినదిగా మంత్రి భాస్కరుడు శ్రీ బుద్ధారెడ్డిగారితో విన్నవించెను. నందుపైన శ్రీ బుద్ధారెడ్డిగారు శ్రీకృష్ణదేవరాయలు పంపిన జాబుసు ప్రత్యుత్తరమందు భట్టుకవికి నొసంగి యుండిన వాగ్దానమును మంత్రి భాస్కరుడు చెల్లించుటను సిద్ధపడి యుండెననియును భట్టుకవి నేగివచ్చి తన అభీష్టము యీడేర్చుకోవచ్చునని శ్రీ బుద్ధారెడ్డిగారుదెల్పబడగానే భట్టుకవి వినుకొండకు నరుదెంచి శ్రీ కోన బుద్ధారెడ్డిగారి సముఖమునననే సభగావించి ఆసభయందు మంత్రిభాస్కరుని వక్షస్థలమున ఖడ్గముతో నొక్కపోటు భట్టుకవి పొడవగల్గగా ఆ ఖడ్గపోటు మంత్రిభాస్కరునికి తగలలేదనిన్ని మరియొక పోటు. తనను

భట్టుకవి పొడచుకొవచ్చునని భట్టుకవికి చెప్పియుండెను. భట్టుకవి తాను ఖడ్గముతో నొక్కపోటును పొడవగలుటను గోరితినని మంత్రిభాస్కరునితో విన్నవించి శ్రీకృష్ణదేవరాయల కడను భట్టుకవి నేగియుండెను.

అటుపిమ్మట శ్రీకృష్ణ దేవరాయలు పెండ్లికాని బ్రాహ్మణుని రప్పించి భాస్కరమంత్రియొక్క రెండవభార్యను ఆబ్రాహ్మణునకు నివ్వవలసినదిగాకోరమనిన్ని భాస్కరమంత్రి యొద్దకు బ్రాహ్మణుని పంపియుండెను.

నా బ్రాహ్మణుడు భాస్కరమంత్రి వద్దనునేగి తనను వివాహముకాలేదనియును, మంత్రిభాస్కరుని రెండవభార్యను తనకు నివ్వవలసినదిగా భాస్కరమంత్రిని గోరెను. అంతట భాస్కరమంత్రి తన రెండవభార్యను రప్పించి నీవు పతివ్రతవు. సత్కుల సంజాతవు నైతివేని నాఆజ్ఞమీరక ఆబ్రాహ్మణునకు నిన్ను దానపూర్వకముగ నొసంగియుంటిని. మున్ను సూర్య వంశమున నొక మహారాజు తన భార్యను నొక విప్రుండడిగిన దానమిచ్చెను భాస్కరమంత్రి తన భార్యను ఆబ్రాహ్మణుని వెంట పంపుటకు సిద్ధపరిచినంతనే నా బ్రాహ్మణుడు భాస్కర మంత్రిపాదములపైబడి భాస్కరమంత్రి తనకుతండ్రియనియును భాస్కరమంత్రి భార్య తనకు తల్లియనియు మొఱపెట్టి శ్రీకృష్ణ దేవరాయలు ప్రేరేపణచేత నట్లు తాను చేసితిననియును భాస్కరమంత్రి తన భార్యను తాను పుచ్చుకొనవలసినదిగా నెంతవేడుకొన్నను భాస్కరమంత్రి అందుకు నిష్టపడకయుండెను

అనుపిస్మోట ఆ బ్రాహ్మణుడు ఘోరముగా విలపించినను వినక నీ ఋష్టమువచ్చినవారికి నిచ్చుకోవలసినదిగా ఆ బ్రాహ్మణు నితో భాస్కరమంత్రి అనగలిగియుండగా ఆ బ్రాహ్మణుడు భాస్కరమంత్రినిజూచి నాకు ఋష్టమువచ్చినవాడవి నీ వేగనుక నీ భార్యను నీవే స్వీకరించుము, అట్లు నీవు స్వీకరించకుంటివా

క॥ కొంకుట సుర సేవించుట
కొంకుట యాయుష్య మడంగిపోవుటగాదా?
కొంకాడువాని నాలుక
అంకాడెడుదాని భగము రాయని కాంచా.

సంతట భాస్కరమంత్రి తనభార్యను తిరిగిస్వీకరించెను. శ్రీకృష్ణదేవరాయలునద్దను బ్రాహ్మణునునేగి జరిగిన వృత్తాంతము తెలుపబడెను.

అంతట శ్రీకృష్ణదేవరాయలు భాస్కరమంత్రిని దర్శించవలసి యున్నదనియును అందుకు భాస్కరమంత్రిని తమవద్దను పంపవలసినదిగా శ్రీ కోన బుద్ధారెడ్డిగారికి వర్తమానము బంపబడెను. శ్రీ కోన బుద్ధారెడ్డిగారు శ్రీకృష్ణదేవరాయలు పంపిన వర్తమాన సంగతిని భాస్కరమంత్రికి చెల్పబడగా భాస్కరమంత్రి నందును దన విముఖత్వము వెల్లడించబడెను.

అందుపైన శ్రీ బుద్ధారెడ్డిగారు భాస్కరమంత్రిజేయు దాన ధర్మములకు కావలసిన ధనమును పంపెదనునిన్నె భాస్కరమంత్రి వెంట కొంతద్రవ్యమును గొని పోవలసినదిగాను

భాస్కరమంత్రిని శ్రీ బుద్ధారెడ్డిగారు కోరబడగా శ్రీ బుద్ధారెడ్డి గారి కోరికను నెరవేర్చుటను భాస్కరమంత్రి శ్రీకృష్ణదేవ రాయలకడకు నేగియుండెను. శ్రీకృష్ణదేవరాయలు భాస్కర మంత్రిని ఉచితరీతిని గౌరవింపజేయించి తన సముఖముగో యుండగలుటకు భాస్కరమంత్రిని గోరెను. కొన్ని దినములు గడచినపిదప, శ్రీకృష్ణదేవరాయలు భాస్కరమంత్రితో సూర్య గ్రహణము త్వరలో రాగలుచున్నదనియును ఆ సూర్యగ్రహ ణమును ఉభయులు చెరియొకవైపునుండి దాన ధర్మములు జేయ శ్రీకృష్ణదేవరాయలను కుతూహలముగలదని భాస్కర మంత్రితోననెను. అందుపైన శ్రీ కోన బుద్ధారెడ్డిగారిని ధనము పంపవలసినదిగా భాస్కరమంత్రి నొక జాబు వ్రాసిపంపెను. ఆ జాబు ప్రకారము శ్రీ బుద్ధారెడ్డిగారు ధనమును బంపగ ఆధనమును భాస్కరమంత్రికి జేరకుండా శ్రీకృష్ణదేవరాయలు తన ఖజానాలో వేయించుకొన గల్గియుండెను.

నటుపిమ్మట మరియొక జాబును శ్రీ బుద్ధారెడ్డిగారికి భాస్కరమంత్రి పంపబడియుండగా ఆ జాబు ప్రకారము పంపి యుండినధనమునుగూడ పూర్వమునలెనే శ్రీకృష్ణదేవరాయలు తన ఖజానాలో జేర్చుకొనగలిగెను

భాస్కరమంత్రికి కోన బుద్ధారెడ్డిగారు ధనముపంపలేదని విచారమునొంది దానమునకు ధనములేదనిజెప్పి అపకీర్తి వహించుటకంటెను మరణమే శరణ్యమని మంత్రిభాస్కరుడు భావించి విషమును సంపాదించుకొన్నవాడై ఆ విషపు పొట్ల

మును గ్రహణస్నానమునకు నరుదెంచినపుడు తనవెంట దీసుకు వెళ్లెను.

గ్రహణ స్నానమును శ్రీకృష్ణదేవరాయల వారును భాస్కరమంత్రియు జేసినవారై ఉభయులు చెరియొకవైపున దానధర్మములను ప్రారంభించగలిరి. కొంత తడువకు భాస్కర మంత్రి ధనము పూర్తియైనంతనే భాస్కరమంత్రి విషపు పొట్లము యూడదీసి నేలపైనకూర్చుని తనవద్దగల పంచపాత్రి యుదకములో విషముగలిపి శ్రీ సూర్యభగవానుని ప్రార్థించి విషముకల్పిన పంచపాత్రలోని ఆ విషజలము త్రాగుటకు భాస్కరమంత్రి నుద్యుక్తుడై నేత్రములనుమూసి పంచపాత్ర పైన జెయ్యివెయ్యగా గరగరగా నాణ్యములు జేతికిదగిలి యుండుటయేగాక సూర్యభగవానుడు మంత్రి భాస్కరునికి సాక్షాత్కరించి, నంతట భాస్కరమంత్రి నేత్రమువెరచిచూడ తాను విషముకలుపుకొనియుండిన పంచపాత్రయందు బంగారు నాణెములు గోచరించెను. నప్పుడు భాస్కరమంత్రి శ్రీసూర్య భగవానునకు ప్రణమిల్లి పంచపాత్రయందు బంగారు నాణె ములను భాస్కరమంత్రి దానమునిచ్చుచుండినను ఆపంచపాత్రి యందుగల బంగారునాణెములను తరుగుచేసుండినవి.

శ్రీకృష్ణదేవరాయలు వెండినాణెములు దానములిచ్చు చుండినట్లును మంత్రి భాస్కరుడు బంగారునాణెములు దాన ముగానిచ్చుచున్నాడని వదంతి శ్రీకృష్ణదేవరాయలును దెలియ బడినది. శ్రీకృష్ణదేవరాయలుకు భోజన సమయము అతిక్ర మించినందున శ్రీకృష్ణదేవరాయలు భోజనమునకు వెడలగలిగి

యుండెను. శ్రీకృష్ణదేవరాయలు భోజనమునకు నేగినంతనే దానమును పుచ్చుకొనుటకు వచ్చినవారు శ్రీ కృ ష్ణ దే వ రాయలును పరిహాసప్రసంగములు పలుకుచుండగా భాస్కర మంత్రి వారితో ఆ పరిహాసప్రసంగములు మాని వేయుడు నేను యొసంగుచుండిన ధనము శ్రీకృష్ణదేవరాయలదే. ఆయన సుకుమారుడగుటచేత భోజనమునకు వెళ్లుతూ ఆయన ద్రవ్య మును దనచేతికిచ్చివెళ్లెనని ఆధనమునే నేను మీకునిచ్చు చున్నానుగాని నాతాలూకు ధనము నెంతమాత్రముగాదని భాస్కరమంత్రి ఆబ్రాహ్మణులకు జెప్పియుండెను. దాన ధర్మ కార్యములను సాంతమొందించుకొని తన నివాసమందిరమునకు భాస్కరమంత్రి నేగియుండెను. అటుపిమ్మట శ్రీకృష్ణదేవ రాయలు తనపరివారముతో మంత్రి భాస్కరుని మందిరముకు నరుదెంచి భాస్కరమంత్రికి ప్రణమిల్లి

సీ॥ నిత్యసత్యత్యాగనీతిలో శిబిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నిన్నుఁ జెప్పి
బహుపరాక్రమమునఁ బరశురామునిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నిన్నుఁ జెప్పి
రఘుకులోత్తముఁడైన రామచంద్రునిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నిన్నుఁ జెప్పి
సుకుమారతను సరి సురరాజసుతుఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నిన్నుఁ జెప్పి

గీ॥ చెప్పఁ దగుఁగాక యితరులఁ జెప్పఁదగునె?
కలియుగంబున నీవంటిఘనుఁడు కలఁడె?
అమితగుణసాంద్ర! మానినీకుముదచంద్ర!
భాగ్యదేవేంద్ర! రాయనిభాస్కరేంద్ర!

శ్లో॥ కృతయుగే బలిర్దాతా త్రేతాయాం రఘునందనః
ద్వాపరే సూర్యపుత్రశ్చ కలౌ రాయనభాస్కరః॥

అని భాస్కరమంత్రిపట్లజెప్పి భాస్కరమంత్రికి మణి కంకణములను శ్రీకృష్ణదేవరాయలు యొసంగియుండగ ఆమణి కంకణములను భాస్కరమంత్రి స్వీకరించకనియును, యితరులకు తాను నిచ్చువాడ ననియును భాస్కరమంత్రి దెల్పగా మంత్రిభాస్కరుడు విద్యజెప్పించబడి శ్రీకృష్ణదేవరాయలుకడ నుండిన భట్టుకవి నేగివచ్చి భాస్కరమంత్రితో మణికంకణములను స్వీకరించవలసినదనియును, శ్రీకృష్ణదేవరాయలు ప్రభువయ్యుండగుటచేత పితృసమానుండని దెలిపిన పిదప భాస్కరమంత్రి శ్రీకృష్ణదేవరాయలు సమర్పించిన మణికంకణంబులను భాస్కరమంత్రి హస్తములకు సలంకరించుకొనసగల్గి యుండెను.

భాస్కరమంత్రి తుంగభద్రా నదియందు స్నానమాచరింపుచుండుట గలదు. అట్లొకనాడు భాస్కరమంత్రి నదీస్నానమాచరింపుచుండునెడ మంత్రిభాస్కరుని హస్తమునందు గల మణికంకణం బొకటి జారి గంగా జలములో బడగల్గగా భాస్కరమంత్రి తన రెండవ హస్తమునందుగల మణికంకణంబునుగూడ దీసి గంగాదేవికి నర్పించియుండెను.

శ్రీకృష్ణదేవరాయలు బహూకరింపజేసిన మణికంకణంబులను మంత్రిభాస్కరుడు గంగా జలములో పారవేసినట్లు కొందరు శ్రీకృష్ణదేవరాయలకు నెరింగించియుండిరి. అందుపైన శ్రీకృష్ణ దేవరాయలు మంత్రి భాస్కరునిగాంచి మణికంకణంబులు కానరాని కతనంబును శ్రీకృష్ణదేవరాయలు భాస్కరమంత్రిని ప్రశ్నించినమీదట మణికంకణంబులు గంగాదేవికి యొసంగతి యని శ్రీకృష్ణదేవరాయలతో భాస్కరమంత్రి విన్నవించెను.

అందుకు నిదర్శనమెట్లుకానవచ్చునని, శ్రీకృష్ణదేవ రాయలు వక్కాణించ గలిగినంతమాత్రమున నేమంత్రి భాస్కరుడు శ్రీకృష్ణదేవరాయలకు గల్గియుండిన సందేహము నివ్వ ర్తింపజేయబడుటకు శ్రీకృష్ణదేవరాయలను నదీజలముయొద్దకు మంత్రిభాస్కరుడు దోడ్కొనిపోయి జగత్పావనియైన గంగా దేవిని భాస్కరమంత్రి ప్రార్థించినపిదప గంగాదేవి ప్రసన్న వదనయై మంత్రిభాస్కరుడు యొసంగియుండిన మణికంకణంబు లను గంగాదేవి తన హస్తములుయెత్తి శ్రీకృష్ణదేవరాయలకు గనపర్చగల్గగా శ్రీకృష్ణదేవరాయలు నత్యంతానందమునొంది మంత్రిభాస్కరునికి పునఃమణికంకణంబులు యొసంగెయుండెను.

సీ॥ ఫణిరాజు తనశిరోమణుల లర్థికిచ్చునో
యనుచు విష్ణువు క్రింద నణఁగియుండె
కైలాసవసుధర మొక్కడ నిచ్చునో యని
యుగ్రుఁ డక్కడఁ గావ లుండఁబూనె
తనయందు మణులు నేతితి నిచ్చునో యని
వనధి సంతతమును వణఁకుచుండె

సురధరాధరము నెవ్వరి కిచ్చెనో యని
తరణి యగ్గిరిచుట్టుఁ దిరుగుచుండె

గీ॥ ఔర! సీదాన విఖ్యాతి యఖిలదిశల
మించి వర్తించె నీకీర్తి నెంచఁదరమె
గాఢదారిద్ర్య యామినీ కాంతిచంద్ర
భాగ్యదేవేంద్ర! రాయన భాస్కరేంద్ర!

సీ॥ అతిథికోట్లకు నిల నమృతాన్న సత్రంబు
నంబలి సత్రంబు నాతురులకు
ఆచార్యులిండ్ల రామానుజ సత్రంబు
నూనె సత్రము శిరస్స్నానములకు
బాలసులకును నేర్పడఁ బాలసత్రము
కామునసత్రము విటగ్రామణులకు
జలకమూడుట కింటు జలసృష్టి సత్రంబు
తాంబూల సత్రంబు ధన్యులకును

గీ॥ కట్టడలుచేసె వినుకొండ పట్టణమున
సర్వకాలము సత్కారపూర్వకముగ
మంత్రిరాయనభాస్కరామాత్యుఁ బోల
గలరె దాతలు మూఁడులోకములయందు?

క. పన్నిద్దఱు భాస్కరులని
యెన్నిక సేయుటదికల్ల యిద్దఱుగాదా
మిన్నున నొక భాస్కరుఁడును
బన్నుగ వినుకొండనున్న భాస్కరుడొకమన్.

# రామలింగభాస్కరుఁడు నందవరీక నియోగి



సీ. ఏమంత్రి సత్కీర్తి హిమసేతుపర్యంత
మవనిమండలము ముత్యాలశాల
ఏమంత్రి మొగసాల యెప్పొద్దు చూచిన
సంగీత సాహిత్య సరసగోష్ఠి
ఏమంత్రి యిలువేలు పిందురేఖావళి
చౌడేశ్వరీ మహాశంభుశక్తి
ఏమంత్రి సౌందర్య మిందీవరాక్షుల
వాలారుఁజూపుల వలపుముద్దు
గీ. అతఁడు హరిదాస వంశాబ్ధి కబ్జభవుఁడు
అర్థి దారిద్ర్య గాఢతమోర్కుఁడతఁడు
దానధర్మ పరోపకారానుకూలి
భాస్కరుని రామలింగన్న భాస్కరుండు
సీ. నీ దేవదేవుండు నిజభక్తరక్షాప
రాయణుం డాదినారాయణుండు
నీ తాత జగదేకదాత రాయనమంత్రి
భాస్కరాన్వయుఁ డైన భాస్కరుండు
నీతండ్రి వితరణఖ్యాతినిఁ గలియుగ
కర్ణుండు రామలింగప్రధాని
నీతల్లి పతిహితసీతా నరుంధతీ
దేవితోఁ బ్రతినచ్చు తిరుమలాంబ
గీ. తనర వెలసితి వత్యంత వినయవిభవ
గురుతరైశ్వర్య మహనీయ గుణగణాఢ్య!

భవ్యభరతుండ! వినుకొండ పాలకుండ!
భాస్కరుని రామలింగయ్య భాస్కరుండ. !

సీ॥ కడఁగి మేఘుం డేక కాలంబునందెకాని
కోమరొప్పనే వేళఁ గురియఁగలఁడె
కల్పభూరుహ మొక్క కాలంబునందెకాని
గరిమ నేవేళలఁ గాయఁగలదె
కమలారి తా నొక్క కాలంబునందెకాని
యే వేళనమృతంబు నీయగలఁడె
కామధేనువు నేక కాలంబునందెకాని
పెంపొంద నే వేళఁ బిదుకఁబడునె

గీ॥ పలుచనై పోక యూసలపాటు లేక
వట్టిపోవక చిల్లరవంక లేక
యనుదినం బర్థుల కొసంగు దార! భువిని
ఘనసుగుణసాంద్ర! రామలింగయ్యచంద్ర!

## గుంటుపల్లి ముత్తరాజు, నందవరీక నియోగి

ఉ॥ వార్తల శత్రురాజుల నవశ్యము గెల్చెనటన్న మేటిస
ద్వార్తలు బ్రహ్మచారులు వివాహము సేయుదురన్న వార్తలుం
స్ఫూర్తిగ షడ్రసాన్నములు భూసురకోటి కొసంగు వార్తలుం
గీర్తివిభూష గుంటుపలి ఖేలన! వీరయమంత్రిముత్త! నీ
వార్తలెకాని యెన్న నిఁక వార్తలు లేవు ధరాతలంబునన్॥

క॥ నాలుగు దుర్గంబులు పదు
నాలుగు దేశముల ప్రజల నయమార్గమునన్
లాలించుచు జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాతుర్గం డే॥

# శ్రీ బమ్మెర పోతనామాత్యుడు

పండితవర్యులలో అగ్రగణ్యుండైన పోతనామాత్యుని నామము లోకమెరిగినదే. భాగవతమును రచించిన పుణ్యమూర్తి, కర్షకవృత్తిజేయు కవివరేణ్యుండు, భగవంతుని ప్రసన్నముగన్న భక్తశిరోమణి. సరస్వతీదేవిచే గృహకృత్యములు బడయగలిగిన భక్తాగ్రేసరుడు, దేవతలను వశపర్చుకొన్న దేవాంశసంభూతుడు

శ్రీనాథుడు తన బావగారైన పోతనామాత్యునకు తన సౌభాగ్యములను ఎరుకపరచవలెనని సమకట్టి తనదర్జాకు తగిన పరివారముతో నొకపాలకీపై బయలుదేరెను. శ్రీనాథు డరుదెంచినపుడు పోతనామాత్యుడు తన తనయునిచేత నాగలి దున్నించుచుండెను. శ్రీనాథుడు తనపల్లకీ మోయుచున్న ముందువైపు బోయీలను దండివిడచి దూరముగా వెళ్లుడని జెప్పెను. బోయీలు అట్లు తప్పుకొనిరి. పల్లకి నడచుచుండెను.

పోతనామాత్యుని తనయుడు మల్లన యీసంగతిజూచి తండ్రిగారి కెరింగించెను. పోతనయు తన తనయునితో నాగలి దున్నుచున్న నొకప్రక్క యెద్దును విప్పివేయుము అనెను. మల్లన వెంటనే నాగలిదున్నుచున్న యెద్దును విప్పివైచెను. శ్రీనాథుని పల్లకీ యెట్లు నడచుచుండినదో పోతనగారి నాగలి గూడ అట్లే దున్నుచున్నది. శ్రీనాథుడదిజూచితనపల్లకి రెండవ వైపు మోయుచున్న బోయీలనుగూడ దప్పుకొమ్మని చెప్పెను. పల్లకివదలి బోయీలు దూరముగానుండిరి. యథాప్రకారము పల్లకీపోవుచుండెను.

మల్లన యీసంగతి తండ్రికెరింగించెను. నాగలికి రెండవప్రక్క యెద్దునుగూడ విప్పివేయుమని పోతనామాత్యుడు తనకుమారునితో జెప్పెను. వెంటనే మల్లన అట్లు రెండవయెద్దునుగూడ విప్పివేసెను. నాగలి యధాప్రకారము దున్నుచుండెను. శ్రీనాథుడు తనపాలకిని పోతనగారి చెంతకు బోనిచ్చి పాలకిదిగి పోతనగారిని గాంచి హాలికులకుగుశలమా అనియడిగెను. అందుపైన పోతనామాత్యుడు

ఉ॥ బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
గూళలకిచ్చియప్పడుపుగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి, గహనాంతర సీమల కందమూల కౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై.

అని పోతనామాత్యుడు పలికినంతనే శ్రీనాథుని గర్వము తగ్గించుకొని పోతనామాత్యుని గృహముకు నరుదెంచిరి. శ్రీనాథునివెంట వచ్చిన పరివారమును చాలినంత నాహార పదార్థములను వియుగ పొరుగువారిని నడిగి యప్పు దీసుకొని రమ్మని పోతన తనకుమారునితో జెప్పెను. మల్లన్న అందుకు జేసిన ప్రయత్నమువ్యర్థముకాగా పోతనామాత్యుడు విచారపడి తనకు బరాభవము రాకుండుటకు సరస్వతీదేవిని బ్రార్థించెను.

సరస్వతీదేవి బ్రత్యక్షమై నీ ప్రతిష్ఠకు భంగముకాకుండా జేసెదను. నీవు వగవవలదు. అందరిని స్నానములు జేసి రమ్మనుము. అనిచెప్పి సరస్వతీదేవి స్త్రీరూపముదాల్చి, పంచభక్ష్య పరమాన్నంబులనుదెచ్చి వడ్డించెను. అందరు తృప్తిగా భోజనమొనర్చి పోతనగారి యైశ్వర్యమున కెంతయు సంతసించిరి.

---

# మంత్రి యుగంధరుడు



మంత్రియుగంధరుడు అఖండయశస్సునొందిన అమాత్య శిరోమణి. ఢిల్లీ పాదుషాసేనలు ప్రతాపరుద్రుని పట్టుకు ఢిల్లీ నగరము గొనిపోయియుండినను, దేశముకు మహాకోప దపము ముంచుకురానుండా జేసిన అకుంఠిత మేధావంతుడు. అమాత్య శేఖరులలో అగ్రగణ్యుండు. ఆయన ప్రదర్శించిన ఘట్టాలు భవిష్యస్సంతతుల వారాశ్చర్యపడకపోరు. తనప్రభువును దెచ్చుటను సాధనమార్గము లన్వేషించిన అకుంఠితధీశాలి. ధైర్యోత్తేజాలు అపార ఆత్మబలము ఆయనలో మూర్తీభవించిన మంత్రి శిరోమణి. తన ప్రభువును పట్టుకొన్నందుకు పరాభవాగ్ని చేగుములుచు ఢిల్లీ పాదుషాను ఖైదీగాపట్టుకొన్న వీరాగ్రేసరుడు.

---

సీ॥ దానమిచ్చినవాడు దారిద్రుడౌనని
బలిచక్రవర్తికి తెలియదేమొ
ధర్మమిచ్చినయంత తనకీర్తిపోనని
ధర హరిశ్చంద్రుండు యెఱుగడేమొ
తనమాంసఖండలు తరిగియిచ్చెను శిబి
చక్రవర్తియుచూడ చపలుడేమొ
యాచించ వెన్నముక దాచకయిచ్చె ద
ధీచుండు చూడగ నీచుడేమొ

గీ॥ వారికంటెను తెలివికి మీరలిపుడు
పుట్టినారయ్య జానెడు పొట్టకొరకు
కూడుగల్గిన నాయంత వాడులేడు
అంచు చరియించ లోకుల నెంచతరమే.

# కోట సింగరాజు నిరతాన్నదాత



సీ॥ రావూరిపురి ఢిల్లి రాజ్యంబులందుండి
సింధుబర్బరమధ్య సీమనుండి
పాంచాలమాళవ పాండ్యభూములనుండి
కటకకల్యాచల గయలనుండి
ఘూర్జరాణ కొంకణ ఘూర్జరోర్వ్యాలనుండి
మళయాళ కేరళ మహులనుండి
భోజకర్ణాటకాంభోజ భూములనుండి
సాల్వాంధ్ర ముఖ్యదేశములనుండి

గీ॥ చాల నేతెంచు సద్విజ సంఘములకు
నన్నదానంబు గావించుచున్న దొరవు
భవ్యచారిత్ర! కొండయప్రభు సుపుత్ర!
కుటిలదుర్మంత్రి మదభంగ! కోటసింగ!

చ. గడుసరి లోభియర్థమది కన్నపుదొంగలబందిపోటుకున్
బుడమిని వారకాంతలకు భూపతికింజనుఁ గోటసింగ! నీ
పడసినయర్థమార్తులకు బాంధవకోటికి యాచకాళికిన్
గుడికిని సత్రశాలకును కూపతటాక వన ప్రతిష్ఠకున్.

గీ॥ కోటసింగరాజు మాటవాసియె కాని
గంగమాంబవలన ఘనత కెక్కె
గంగమాంబ జగతి గయ్యాళియైనను
సింగరాజు కేమి సేయగలఁడు.



# నిట్టల హరిహరప్ప



క. నిజమా రాజ్యసుఖంబులు
నిజమా తరుణీవిలాస నిరుపమలీలల్
నిజమా సంపచ్చ్రయములు
నిజమా యీజీవనంబు నిట్టలహరియా !

క. ధీరోదార గుణంబులు
కారణజన్ముఁడవు వేఱ కలుపఁగవలెనా
ధారుణిలోఁ డెంకాయను
నీరెవ్వరు పోసిరయ్యా నిట్టలహరియా !

క. నిట్టలహరియుండెయి యిలఁ
బుట్టెను సురధేనుకల్ప భూరుహములు దా
మట్టులు గాకుండినచో
నెట్టుల నిడు నర్థికోటి కీప్సితఫలముల్

క. దాతల దాతవుగదరా
భూతలమున నెట్టి సుకృతముం జేసిరొకో
ఖ్యాతిగల నిన్నుఁ గనుటకు
నీ తలిదండ్రులు గడంగి నిట్టలహరియా !

---

గీ. ఉత్తముండు హితము చేసి యూరకుండు
మధ్యముండు హితము చేసి మాఱువేడు
నధముఁడొరు చేయు హితమైన నడచిపుచ్చు
హితమునకు నెగ్గుచేయువాఁడెవ్వఁడగును.

# సింగనమంత్రి మాచడు



సీ. న్యాయంబుదప్పని నరపతి నరపతి
  నరపతిపాలించు నాడు నాడు
నా డెఱింగినదొర పోఁడిమి పోఁడిమి
  పోఁడిమి సొబగైన బుధులు బుధులు
బుధులు సంభావించు పురుషుండు పురుషుండు
  పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి
బుద్ధిమంతునకైనపుణ్యంబు పుణ్యంబు
  పుణ్యలక్షణ మైనపొలఁతి పొలఁతి

గీ. పొలఁతి యట్టిద కలవానికలిమి కలిమి
కలిమి చల మని తెలిసిన తెలివి తెలివి
భానునిభ తేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ!.

సీ. అర్థులయెడలఁ బ్రత్యర్థులయెడలను
  వెఱ పెఱుఁగనివాఁడె వీరవరుఁడు
సతులసన్నిధి మహీపతుల సన్నిధియందుఁ
  దత్తఱింపనివాఁడె ధైర్యపరుఁడు
ధన మగ్గలంబైనఁ జవ నగ్గలంబైన
  గర్వ మెఱుఁగనివాఁడె కార్యపరుఁడు
శివునిమీఁద నైనఁ గేశవుమీఁద నైనను
  దలఁపు నిల్పినవాఁడె తత్త్వఘనుఁడు

గీ. కాన నిట్టివివేకంబు గలిగి మెలఁగు
పురుషు లిహపర సౌఖ్యముల్ పొందువారు
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ!.

సీ. తల్లిదండ్రులఁ బ్రోచు తనయుండు తనయుండు
తగురాజు చేపడ్డ ధరణి ధరణి
అభిమానవతి యైన యంగన యంగన
యక్కఱకొదవిన యర్థ మర్థ
పొరుకాంతఁ గోరని పురుషుండు పురుషుండు
వేఁడని యాతని విద్య విద్య
సంగరాంగణమునఁ జచ్చుట చచ్చుట
పవసించి సల్పెడు వ్రతము వ్రతము

గీ. ఎదురు తన్నెఱిఁగినయట్టి యెఱుక యెఱుక
ప్రజలు మెచ్చఁగఁ జెప్పెడి పాటి పాటి
పగయె లేకుండ బ్రదికిన బ్రదుకు బ్రదుకు
మనుజమందార! సింగనమంత్రిమాచ!

సీ. కులమున నధికుఁడై గుణవంతుఁ డయ్యెనా
యాకారహీనుఁడై యలరుచుండు
నాకారలక్షణం బంతయుఁ గల్గెనా
యోగ్యత లన్నియు నొప్పకుండు
యోగ్యత లన్నియు నొప్పుచు నుండెనా
గర్వాంధకారంబు గప్పియుండు

గర్వాంధకారంబు గప్పక యుండెనా
    యనుకూలసతి లేక యవయుచుండు
గీ. కొమ్మ గలిగిన సంతతికొఱకు వగచు
పుత్త్రసంతతి మొదలుగాఁ బొందె నిన్ను
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ!

---

# ఆంధ్రమండలంబు పాలించిన రామయ్యభాస్కరుడు

సీ. నిర్మించె నేమంత్రి నిరుపమ ప్రాకార
    నవకంబుగా గోపినాథపురము
గెలిచినాఁ డేమంత్రి లలిత విక్రమమునఁ
    బ్రబలుఁడై యవనుల బలము నెల్ల
నిలిపినాఁ డేమంత్రి నియత వైభవముగ
    గోపికావల్లభుఁ గూర్మి వెలయ
పాలించె నేమంత్రి ప్రకట ధర్మఖ్యాతి
    మహిమ మీఱఁగ నాంధ్రమండలంబు
గీ. అతడు భూపాలమంత్రీంద్ర సతతవినుత
ధీవిశారదుఁ డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్యమహితయశుఁడు
భానుతేజుండు రామయభాస్కరుండు.

# చేమకూర అప్పరాజు

సీ. దాతతో నర్థుల తారతమ్యము జెప్పి
యిప్పింప నేర్చుఁ దా నీయనేర్చు
నవరసాలంకార నయకవిత్వప్రౌఢిఁ
దెలియనేర్చును నన్యుఁ దెలుపనేర్చు
భట్టవాగట్టఘట్ట సంఘట్ట కవిత్వంబు
చదువఁగా విననేర్చుఁ జదువనేర్చు
మానవోత్తములైన మహితలాధీశుల
మెప్పింప నేర్చుఁ దా మెచ్చనేర్చు

గీ. దాత కవి భట్టురాజును దానయనుచు
మహిమ నుతికెక్క ధారుణీమండలమున
వీరరిపుదంతి మథన కంఠీరవుండు
రమ్య శ్రీ చేమకూరప్ప రాజుమంత్రి!

క. అనుదినము నీడ ద్రోకఁగ
నొనరఁగ సురభూజ మీయ దొకకాసైనన్
దినదినము సుకవిజనులకు
ననయము శ్రీ చేమకూరయప్పన యిచ్చున్.

# కొమ్మనామాత్యుడు రాజ్యపాలన

మ॥ అరుదందన్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనంబూని దు
స్తరశక్తింజని యేకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణించేర్చిన పాకనాఁడు నిజదోర్దండైక లగ్నంబుగా
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై.

# రణతిక్కనామాత్యుడు

ఈ మంత్రి మార్తాండుండు నెల్లూరి సంస్థానంబున సేనాధిపతిగాయుండెను నెల్లూరిమీదికి విజయాధిపుండు మహాచతురంగబలముతో వచ్చి సిద్ధమనృపాలుని జయింప యుద్ధ సన్నద్ధుడై యేతెంచినపుడు నెల్లూరి సంస్థాన సేనాధ్యక్షుడైన రణతిక్కనామాత్యుడు తన సైన్యంబుతో నెదుర్కొని కొంత సేపటి బరిమార్చి యలసి యింటికివచ్చి పవళించినతరి తన తనయుండైన తిక్కనామాత్యునిపై కొమ్మనామాత్యుడు ఆగ్రహము పట్టజాలక

సీ. విజయాధిపునిదాడి సెనువెంటఁ దగిలిన
ప్రాణముల్ దాచిన పందగజమ
పెనుజల్లిపల్లెలో బిరుదములన్నియువైచి
పరుగెత్తివచ్చిన పాఱుబోత
దురములోఁ జావక దొరలెల్ల హసియింప
మంచానకొరిగిన కొంచెకాఁడ
చతురంగబలముతో సమరంబు సేయక
మానంబు విడిచిన మందబుద్ధి
గీ. యనుచు నార్వేలవారు నిన్నపహసింప
ధరణి నెల్లూరిలో నెట్లు దిరుగఁగలవు?
వైరులను గెల్చి సత్కీర్తి వడయుమయ్య
మంత్రికులహేళి! తిక్కనామాత్యమాళి!.

అని తండ్రి నిందించిన లేచి స్నానమొనరించి రణంబునకేగువాఁడయి జలంబులందొరకవుమనిన తల్లియగు మయిలమ్మ యొకవిజనస్థలంబునందుదకముంచి యచ్చట పసుపుముద్దయు గుంకుమ బర్ణియు నుంచి యొక మంచంబడ్డిడి కుమారుండగు రణతిక్కనిం బిలచి స్నానమాడుమనినఁ దిక్కఁడది చూచి స్త్రీలు స్నానమాడు విధముగాఁ బసుపుం గుంకమయునుంచి మరుఁగున జలంబు లిడితివి కారణంబేమి యని యడిగిన చెంత నున్న భార్య, రణంబునం బాఱివచ్చిన నీవాఁడుదానవు గాన నిటులొనర్చితి నింతదనుక నేనును నీతల్లియు నిరువుర మాఁడు వార మింటనుంటిమి. ఇప్పుడుముగ్వురమైతిమి.

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరే మనయాఱు వేల నాయకులందుం ?
ముగురాఁడువార మయితిమి
వగపేటికి జలకమాడ వచ్చినవేళన్ ?

అని భార్యచెప్పిన విని లజ్జితుండయి యతిత్వరితగతిం జని పెన్నలో స్నాతుండయివచ్చి భోజనంబు సేయునెడ తల్లి విరిగినపాలువడ్డించిన నమ్మా! పాలు విరిగిన వేమన నీవురణంబు నకుం జనిన పసులును గోలంబునకుఁజనియె నీవు విఱిగివచ్చిన నవియును విఱిగివచ్చె పాలును విఱిగెనని తల్లి చెప్పెను.

క॥ అసదృశముగ నరివీరులఁ
బసవిగాఱగ గెలువలేక పందక్రియ న్ని
వసి వైచి విఱిగి వచ్చిన
బసులు న్విరిసినవి తిక్క! పాలు న్విఱిగెన్.

అనినవిని యుద్ధసన్నద్ధుండగుచు యశ్వారోహణంబొనర్చి యరివరులం జెండాడి చతురంగంబులు యంగంబుల భంగించి పద్మవ్యూహం బభిమన్యుండు భేదించునట్లు సంకులం గొందులం గల పాలుంబోతుల రక్షించుచు పీనుంగు పెంటలం జేసి రణ రంగబునను వన్నె వెట్టిన విధంబున వివిధాసిశిరోహస్త్రాద్యవయ వంబులచే నిండించి రక్తార్ణవంబు గావించి విజయాధిపుండను విరోధి పరూధినీనాథుని సేనలోనుండు పడవాండ్రు మన్నీలు పజీర్లు మొదలగువారి వెనువెంటం దగిలి తిక్కండార్చిన నదరి బెదరి చెదరి మొకుపంజాలక పాఱువేడ తన

చ॥ పదిలము సేసి రావుతుల ♦ పైకురికించుచు తిక్కండార్చినం
బెదరిభ్రమించి భీతిపడి ♦ వెన్నుగమాయకులు చంచలింపగా
నదె యిదె వాజి నాల్ మెఱుంగు ♦ ల్లవె యంతండె
తిక్కండంచుం జె
ల్లదరి చరించిశౌర రిపు ♦ లందఱు శౌర్యము దక్కిపోవంగన్

అట్టియెడ నావిజయాధిపుండనురాజు సేనల నాంపి పురికొల్పుకొని మరల యుద్ధంబునకుం జని చుట్టుముట్టిన నా మంత్రి శేఖరుం డగణ్యపటాస నైపుణ్యంబున సాహసంబు నెరపుచు వైరులం దునుముటం జూచి యావిజయాధిపుండు సహింపంజాలక శతఘ్ని ప్రహారప్రయోగంబు గావింప ఖడ్గ తిక్కం డొరిగి ధరంబడినం దదీయాశ్వంబు బతని మృతునింగా నెఱింగి తచ్ఛిరంబు గొఱుకకొని నోటంగఱచి నెల్లూరికేగి తద్గృ హద్వారంబున శిరంబుడించి కంఖాణంబు కరాళించిన విని

తజ్జనకుండగు కొమ్మనామాత్యుఁ డేతెంచి శిరం బీక్షించి యతి దుఃఖితుండయి

ఉ. తక్కక తల్లిదండ్రులము ♦ ధన్యతగన్న ఋణంబుదీర్చె మా
తిక్కనమంత్రి సోమశిల ♦ దేవుఁడు సాక్షిగ పెన్నసాక్షిగా
స్రుక్కకమారుకొన్న రణ ♦ శూరులసాక్షిగ గొండసాక్షిగా
నెక్కినవాజి సాక్షిగర ♦ ణింమముఖగ్రహరాజ సాక్షిగన్.

అని యాశిరంబుంబట్టి ముద్దిడుకొని దుఃఖించుచుఁ

సీ. స్థైర్యంబు నీమేనఁ దవిలియుండుటఁజూచి
చలియించి సుందరాచలము దిరిగె
గాంభీర్యమెల్ల నీ కడనుండఁగాఁజూచి
కానుతుచే వార్ధి గట్టునడిచె
నల లక్ష్మి నీయుర స్థలివసింపఁగఁజూచి
హారివోయి బలిదాన మడుగుకొనియె
నాకారమెల్ల నీయందు డాఁగుటఁజూచి
మరుఁడు రుద్రునికంటి మంటగలసె

గీ. తిక్కదండనాధ దేవేంద్రపురికి నీ
వరుగు టెఱిఁగి నగము దిరుగు టుడిగె
నబ్ధి కట్టువిడిచె హరి యక్కఱయుఁ దీఱె
మరుఁడు మొలఁగ నేర్చె మగలరాయ.

అని తండ్రి దుఃఖించుచున్న నతనిభార్య యగు మయిలమ్మయుఁ దిక్కనిం బెంచిన పోలమ్మయును సుతుని శిరం బీక్షించి యనేకవిధంబుల విలపించును పోలమ్మ తిక్కఁడు లేని

యీ విక్రమసింహపురంబను నామాంతరముగల యీ నెల్లూ రత్యంత ఖిన్నంబై దీపంబులేని గృహంబునలె నున్నదని,

ఉ॥ వెన్నెలలేని రాత్రియు ర ♦ వి ప్రభ లేని దీపంబు నీరు లే
కున్న సరోవరంబు కడు ♦ నొప్పుగ దీపములేని ఇల్లునై
విన్నదనంబునొందె మన ♦ విక్రమసింహపురంబు చూడఁగాఁ
బున్నమ చంద్రుఁబోలు మన ♦ పోలమ తిక్కఁడు లేమినక్కటా

ఖడ్గతిక్కని భార్యా యరుదెంచి పతియుత్తమాంగంబు జూచి యత్యంత దుఃఖాకులిత స్వాంతయై ఘూర్ణిల్లుచు నితని తల్లి యేమి తపంబుచేసి కనియెనో యీతఁడు మద్భర్తయగు టకు తొలుబామున నేనేమి నోములు నోచితినో యని చింతించుచు,

ఉ॥ ఏమి తపంబుచేసి పర ♦ మేశ్వరు నేమిటఁ బూజఁజేసిరో
రాముని తల్లియుం బరశు ♦ రాముని తల్లియు భీముని తల్లియున్
గాముని గన్నతల్లియును ♦ గంజదళాక్షునిఁ గన్నతల్లియున్
శ్రీమహితాభిరాముఁడగు ♦ సిద్ధయతిక్కనిఁ గన్నతల్లియున్॥

కొమ్మనామాత్యుఁడు మొదలగు తద్బంధుజనంబులు ఖడ్గ తిక్కఁడు వీరస్వర్గవాసి యయ్యెగాన వీనికై వగవఁ బనిలేదని సైర్యం బవలంబించిన తిక్కని భార్యయగు వీరలక్ష్మి తన మామం జూచి మీ సుతుని శిరంబుతో నేనును సహగమనం బొనర్చెద నాజ్ఞ యొసంగుమని దండప్రమాణమం బొనర్చిన నంగీకరించి నుచితస్థలంబున నొక కుండంబు నిర్మించి యందు

పకరణంబులు నాయితంబుచేయించి తల్లీ! నీ యిష్టప్రకారం బొనర్చు మనినఁ దిక్కనమంత్రి శిరంబు నొకశకటంబున నిడుకొని పంచమహా వాద్యంబులతో నుత్సవంబొనర్చుచు నవ్వీరపత్ని తనకుగలభూషణాంబరాదులు పసుపుగుంకుమలతో ననేక సువాసినీజనంబులకు సమర్పించుచు పెద్దలంగనిన వందనంబు లొనర్చుచువచ్చునెడ దైవికంబుగా నామెపుణ్యవశంబున నచ్చటి కెదురుగా వచ్చుచున్న మహాకవి సార్వభౌముండగు వేములవాడ భీమకవీంద్రుంగని మ్రొక్కిన నతండు 'దీర్ఘసుమంగళీభవ' యని యాశీర్వదింప నామె వెంటంజను పరివార బంధువర్గంబు లాకవి సార్వభౌము భీముఁగా నెఱింగి యయ్యా! యీమె పతి దురంబున నరివీరులచేఁ దెగి వీరస్వర్గ నివాసుండయ్యె. నతని శిరంబుతో సహగమనంబొనర్పఁబూని పతివ్రతాశిరోమణి అను నీ చిన్నది చనుచున్నది. ఇప్పుడు మీరు మ్రొక్కిన మీ రీరీతి నాశీర్వదించితిరి. మీవచనం బమోఘంబుగదా యనునెడ నా యమ భీమకవివర్యు పాదపద్మంబుల వ్రాలి తండ్రీ! నీకేను బుత్రికను నీవు మదీయజనకుండవు నీ కారుణ్యంబున నీ దీవెన సఫలంబుగా నా ప్రాణనాథు బ్రతికింపుమని పునఃపునః ప్రణామంబు లాచరించిన నాకవి సార్వభౌముఁ డాసాధ్విం జూచి నేనొక్కటిఁ జెల్పెద నది విరుద్ధంబుగా నెంచక చేసెదే యనిన దండ్రివగు నీవాక్యంబు విరుద్ధంబగునే యద్దియో యానతిమ్మన నాభీమకవి నీకోర్కె యొనగూర్చెద నీపతి శిరంబిచ్చటనున్నది. కళేబరంబు గానరాదు. ఎచ్చటనున్నదో తెచ్చిన బ్రతికించెద ననన నప్పురంధ్రీ రత్నంబా సభికులం జూచి నా ప్రాణనాథుని కళేబరంబా రణాంగణంబుననున్నది. దానిం జూపెదరండనిన

వారంద అచ్చటికిం జని నీపతి కబంధంబని మాకెట్లు గుఱుతు గలుగునన నవ్వీరపత్ని వారింజూచి అయ్యా! నాపతి కళేబరం బయిన నేఁబిలిచిన నిలిచి నృత్యంబొనర్చు లేకున్న నూరకుండు నని యొక గుఱు తెఱిగించి రణక్షితింగల కబంధంబు నుప లక్షించి శత్రుసేనా సంహారంబొనర్చి బంధుప్రియంబొనరించి దేవతా వినోదంబుగా రణక్రీడ గావించితి వలసి నిద్రించు విధం బునం బండియుండుట యుచితంబుగాదు. భీమకవీంద్రుండు మొదలగు కవిబుధులును భవజ్జనకాది బంధువర్గంబులును నా శీలంబుఁ జూడందలంచి నీ కళేబరంబు దెచ్చిన సజీవునింగావిం చెదమని యీ భీమకవీంద్రునిచే వరమొసంగించిరి. కావున నీ దివ్య కళేబరంబు వీక్షించెద లేచి వర్తనంబు సేయుమని సూర్యమండలంబుఁ జూచి నమస్కరించునప్పుడా గాత్ర ఖండం బులు నృత్యంబు సేయుచు నప్పతివ్రతా తిలకంబు సమీపంబున కేతెంచునప్పుడు.

ఉ॥ శ్రీయలరార శత్రువులఁ ♦ జెండితి వార్యులు మంత్రివర్యులా
ర్వేలఘనుల్నుతించి రల ♦ వేల్పుగొరల్ ముదమంది మెచ్చిరో
లాలిత శౌర్యధైర్య జయ ♦ లక్ష్మి ప్రియంబున నిన్వరించె నీ
లీలల మెచ్చఁ దిక్కని క ♦ ళేబరమా యిటనిల్చి యాడవే.

అప్పుడాసాధ్వీరత్నం బాకళేబరం బుపలక్షించి మీతండ్రి యగు కొమ్మనామాత్యుండును మా తండ్రియగు భీమకవి ముఖ్యుండును నిలిచియున్న నెలవునకుం జనిన యప్పుడు నిన్ను విశ్వసించెద ననిన కళేబరంబు వారి సమీపంబునకుం జరజర నరిగె నట్టియెడ నచ్చటి జనంబు లీమె పతివ్రతా మహాత్మ్యం

బింతయెప్పునే యని యత్యాశ్చర్య మగ్నమానసులైరి. భీమ కవివర్యుఁ డామెనుఁజూచి తల్లీ. యిట్టి పరీక్షంగావించితివని కోపగింపను శిరః కళేబరంబులు రెండును గలసినగాని సజీవునిఁ గావింప వలనుగామిఁ గాని మరియొండు గాదని పలికె యిప్పుడ బ్రతికించెదఁ జూడుము.

క॥ గణముల విధానమగు మన
రణతిక్కఁడు తాఁ గళేబరంబును శిరముం
గఁణక మెయిఁ గలయ ♦ బ్రతుకును
బ్రణుతాఖిల వైరిమకుట భాసితపదుఁడై.

అని దీవించిన ఖడ్గతిక్కఁడు తొల్లిటికంటె సత్త్వబల తేజః పౌరుషాది సంపన్నుండై లేచి తన తండ్రియగు కొమ్మనామాత్యుని పదంబులకును భీమ కవీంద్రు పదంబులకును నమస్కరింప నందఱు నానందభరితాంతః కరణులైరి. అప్పుడు భీమకవీంద్రుఁడు రణతిక్కని ఖడ్గంబుపై

చ॥ గరళపుముద్ద లోహమున ♦ గాఢమహాగ్నిికో ట్లుసమ్మేటల్
హరునయనాగ్నికోల్మి యుర ♦ గాధిపుకోఱలు పట్లుకార్లు ది
క్కరుల శిరంబుదాయి లయ ♦ కారుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు ♦ మైలమతిక్కని ఖడ్గ సృష్టికిన్ ॥

అని వర్ణించి యథేచ్ఛంజనియె. వీరును నందఱుంగలసి సుఖోపభోగంబు లనుభవించుచుండిరి.

---

# మంత్రి సేదమయాజి

సేదమయాజి యను ప్రధానశేఖరుండుపయి యొక కవీశ్వరుండు నొక కృతిని రచించుకొనియాబెల్లముకొండఅను దుర్గములోని కరుగునంతకు సాయంకాల మగుటచే నారాత్రి యక్కడ వసియించి రేపటిఉదయంబున ఆమంత్రిని దర్శనంబు గావింతు ననుకొని గ్రామాంతరంబుననున్న శ్రీమదాంజనేయ స్వామి వారి ఆలయంబున నిద్రించిననాటి నిశీథసమయంబున నొక క్రూరసర్పం బతనింగఱచి పంచత్వంబు నొందించెను. తత్ప్రాతఃకాలంబునం బాదేవతా పరిచారకుం డావార్త సేద మయాజి కెఱిగించిన నామంత్రి పరమేశ్వరుండు విషాదా కులస్వాంతుండై యచ్చోటికేగి యాతనింజూచి యతని పరి చారకులతో మీరెవ్వ రిచటి కరుదెంచుట కేమి కారణంబని యడిగిన వార లయ్యా! మేము కవీశ్వరులము మీపయి నొక్క పద్యంబు రచియించి మీ దర్శనమొనర్చి మీ యనుగ్రహం బున సంప్రాప్తంబగు ద్రవ్యముంగొని మమ్మును తన కుటుంబ మును పోషింపందలంచి యిచ్చటికరుదెంచి పాముచేఁ గఱవం బడి కాలధర్మంబు నొందెనని వార లత్యంత చింతతో విచా రించుచు విన్నవించిన వారల నూరడించి తన యిష్టదైవంబగు వాయునందనుంజూచి ప్రార్థించి తద్వరప్రసాది యగుటచే నా దేవు నుపలక్షించి స్వామీ! లోకంబున నపకీర్తికంటె మర ణం బతిశుభంబని యార్యు లెన్నుదురు. నన్నాశ్రయించి సం పద లందగోరి ఈకవి యిచ్చటికేతెంచి పంచత్వంబు గాంచె

నిట్టి యపకీర్తి నొందుటకంటె నితనితోఁగూడ నేనునుం బర
లోకంబున కేగిన బరమసుభం బగునని తద్దేవతా చరణ
సమీపంబునం దానొక గండకత్తెరం దగిలించుకొన నూహిం
చిన తత్పవనతనయుం డతని ధైర్య సాహసానుగ్రహ పరోప
కారాది గుణంబుల కత్యాశ్చర్య మంది, తన కితఁడని ప్రియ
భక్తుండుగానఁ బ్రసన్నుఁడై యోమంత్రివర్యా! నీవిట్టి దారుణ
కృత్యంబు సలుపుట కేమిపని? కాలంబుసమకూడె. అట్టిపని
కీపి కఠినకార్యం బొనరించుట యుచితంబుకాదు. నీ కేఁబది
వత్సరము లాయువు కల దిప్పుడేల నీపనియవలంబించెదవనిన
నా స్వామిని స్తుతించి దేవా! నీవు నాయం దనుగ్రహించి నా
యాయువులో సగ మీతనికిచ్చి రక్షింపుమని సవినయంబుగా
వేఁడిన నతని కారుణ్యంబునకు మెచ్చి యా కవిని సజీవితుం
జేసి యయ్యాంజనేయమూర్తి యంతర్హితుండయ్యె. నా కవి
నిద్రించి లేచినటుల దిగ్గునలేచి చాలా ప్రొద్దెక్కెనని యీ
వలావలం జూచునెడ నతని పరిచారకు లాసేదమయాజి చేసిన
వృత్తాంతంబు విన్నవించిన కవి విని యద్భుత చిత్తుండయి.

ఉ॥ మీఁదివెలుఁగు పూర్ణశశి ♦ మేనికళంకముఁగప్ప క్రిందటన్
రోఁదుచున్న శేషఫణి ♦ రోచులఁగప్ప సుధాపయోధిలో
నీఁదెడుకృష్ణుగప్ప పర ♦ మేశ్వరుకంఠముఁగప్ప కప్పి మా
సేదమయాజి కీర్తి విల ♦ సిల్లెను దిక్కులఁ బిక్కటిల్లుచున్

అని నుతించిన నతని కనేక సత్కృతులొనర్చి దిగంత
విశ్రాంత కీర్తి కాంతుండయి సుఖంబున నుండెను.

—— (o) ——

# బందా పరదేశ మంత్రి

క॥ బృందారక లోకంబున
మందారంబుఁడ నెఱచి మహి కేతెంచెన్
బందా పరదేశియ నా
నందముగా నర్థికోటి కాధారంబై॥

ఈ మంత్రి నిరతాన్నదాన దీక్షాదురంధరుండై యమరావతి సంస్థానములోఁ జేరిన యొక యూరి కరణంబై కృష్ణాతీరంబున నుండె. ఇట్లుండ నయ్యమరావతి పురాధీశ్వరుండును వాసిరెడ్డి వెంకటాద్రినాయుండను రాజు కాశీపురంబునకుం జని నిత్యంబు స్నానమాచరించుచు కొంతకాలము కాశిలో నివసించి విశ్వేశ్వరుని చందంబున నున్న కాశీరాజగు శ్రీమంతునిఁ గాంచి వారికి సాష్టాంగ దండప్రమాణుండయి లేచి తత్పాదపీఠ సమీపంబున కరిగి వజ్రమయంబగు హారి వాణంబును పంచపాత్రయు కానుకగా సమర్పించిన నా శ్రీమంతుండు బందా పరదేశమంత్రిని గూర్చి ప్రశంసించి కొంతసడవునకు సెలవొసంగిన మఱల జనకీలించి అటుపిమ్మట నిజరాజధానిం జేరి నా రాజ్యంబున నొక గ్రామంబున కరిణీకంబుఁ జేసికొనెడి కాణాచింత కీర్తిశాలియగునే యనిదలంచి బందా పరదేశిని అగ్నిపరీక్ష చేయ సమకట్టియా తాని యీ నామములను పరిపాచుకొని యుండెను. అంతట బందా పరదేశమంత్రి పూర్వము వలెనే అన్నదానంబు గావించుచుండ క్రమంబున నన్నియు

నామావశేషంబులైన నింకేమియుగృహంబున లేకుండుటం జేసి పువ్వులమ్మిన యూర నేకట్టెలమ్ముటకు స్తరంబని తలంచి యన్న పూర్ణావతారయగు భార్యయు విశ్వేశ్వరాకారుండగు తానును నొకనాటిసాయంకాలంబున కాశికింబోదమని తలంచుకొని యప్పుడ బయలువెడలి క్రోశమాత్రదూరంబున నొకపల్లెగాంచి నడునజాలక యొకరచ్చసావిడింగాంచి యందుశయనించియుండ మూండు దినంబులనుండియన్నంబులేక యాకటుడస్సి కొంత మంది పరదేశులు అచ్చోటికేతెంచి వారిలో వారు పరదేశ మంత్రీంద్రుని గ్రామంబిచ్చటికి క్రోశమాత్రమున నుండు. రాత్రి యామద్వయంబున కేనియునచటికేగితిమేని మృష్టాన్న సంతుష్టులమయ్యెదమని యనుకొనుమాట లాదంపతులు లాలించి యహో యిట్టి కష్టములు వినవయ్యెనని చింతించుచుండ నాతని యిల్లాలు భర్తంగని మీరు మనయూరుజేరక మునుపు మనమే చేరగల శక్తిగలవారమైయున్నారము మనగృహంబున నిత్యంబు పచ్చళ్లు రుబ్బుకొను గొప్ప చాపఱాతి రుబ్బురోలొకటి గలదు. దాని నెవ్వరికేని విక్రయించి వీరినిం దృప్తులం జేసి రేపకడలేచి పోదమనిన భర్తయు నియ్యకొనెను ఇట్లిరువురు గృహంబునకు వేగంబునం జని శ్రీరాముని దలంచి యారాయి యిరువురిచేతలం బట్టి దొర్లించు నంతను దానిక్రింద కోటి సువర్ణంబులచే నిండింపబడిన యొకగోలెంబుగాన్పించిన నత్యంత సంతుష్టాంతరంగులై మనపాలిటి పరమేశ్వరుండిట్లొసంగెనని యనుకొనుచు నుండ నంత వారలేతెంచిన వారలను అన్నదానంబు గావించెను.

పూర్వముకంటె మిక్కుటముగా ప్రతి నిత్యము అన్న దానము గావించుచుండిన సంగతులను శ్రీ వెంకటాద్రినాయుడు గారికి తెలియవచ్చినంతనే బందా పరదేశమంత్రిని తన సంస్థానమునకు ప్రధాన మంత్రిశేఖరునిగా యుండుటకు నేర్పాటుచేసుకొనియుండుటయేగాక, శ్రీ వెంకటాద్రినాయుడు గారులోగడ వశపర్చుకొనిన యీనాములును, మరికొన్ని వందల యకరముల మాన్యంబులను తిరిగి బందా పరదేశమంత్రి గారికి నొసంగియుండిరి. బందా పరదేశమంత్రిగారు ననేక దేవాల యారామ కూప వన తటకాది ప్రతిష్ఠలుజేసి కీర్తి వహించగలిగిరి.

బందా పరదేశమంత్రిగారి గృహనామముచే బందరు పట్టణము నిర్మింపబడ్డది. శ్రీ బందా పరదేశమంత్రివర్యుల వంశమునందు శ్రీబందా వెంకటసుబ్రహ్మణ్యంగారు, పల్లెవాడ శివారు నరసాయపాలెం, కైకలూరుతాలూకా, కృష్ణాజిల్లా. వీరు నిరతాన్నదాతలు, వందపుట్లు ధాన్యము పండించు భూస్వామి, గోమాతలను వందలతరబడి పోషణజేయుచున్న పోషణకర్త. శ్రీ బందా కనకరాజుగారు బి.ఏ. జిల్లాకోర్టు వకీలు, లాజర్నల్ పత్రికాధిపతులు, గుడివాడ. బందా కనకలింగేశ్వర రావుగారు, బి.ఏ. బి.యల్., ప్రఖ్యాతిగాంచిన సినిమా, డ్రామా నటులు, ఏలూరు. శ్రీ బందా భాస్కరరావుగారు, ఇంపీరియల్ బ్యాంకు మేనేజరు, విజయవాడ. మొదలుగాగల ప్రముఖులు కృష్ణా, గుంటూరు మండలములయందు గలరు.

---

# బండారు కేతన్న మంత్రి

శ్రీ కృష్ణదేవరాయలవారి సంస్థానమునందు నొక మంత్రివర్యుడుగా విరాజిల్లగలుగుచూ, ఆ మంత్రిశేఖరుడు నొక భట్టుమూర్తిని పెంచి విద్యాధికునిగాజేసి పోషించుచుండెను. ఆభట్టుకవీశ్వరుడు కేతనమంత్రినిగాక నితర రాజులను మంత్రులనుగూడ కైవారంబుజేయక నుతింపనని దీక్షవహించెను.

అట్టియెడ ననేక పర్యాయంబులు కృష్ణరాయలును తన్మంత్రియగు నప్పరుసుంగాంచి కైవారం బొనర్పకుండుటచే నా రాజనమండా సంగతి గ్రహించి మంత్రింగాంచి ఇదియేమి అప్పా? భట్టులు కయివారంబొనర్పకుండుట వింతగానున్నది. నీవిట్టి విపరీతం బెచ్చటనైనం గంటివే అని యీభట్టెవని యాస్థానంబుననుండువాడో? అనియడిగి యాతని వృత్తాంతం బంతయుం దెలిసికొని యా బండారు కేతన్నన చటికింబిలిపించి నీ భట్టు నన్నుంగని కయివారం బొనర్పండయ్యె నట్టి దురభిమానం బితనియందె కంటిమి. ఇతరులందుం గానమని యడిగిన నా కేతనమంత్రి యతని స్వభావంబట్టిది. కాని గర్వము కాదని విన్నవించిన రాజా భట్టునుంజూచి కయివారం బొనర్చెదవా? లేదా? అని యడుగ నాభట్టు బండారు కేతన మంత్రిని నుతించిన యీనోట నితరు లెట్టువంటి వారయినను నే నుతింపనని ఖండితముగా నాడిన నాగ్రహించి నీవునను బొగడకుండిన నీ నోటిలో నురుసు సీసపు మడ్డు పోయించెద ననిన మడ్డు పోయించినను నే నతని పద్యమే చదివెదనుగాని ఇతరుల

నుతింపనని పలికిన రాజప్పుడే సీసముకాచించి యాతని నోటం
బోయించునెడ నాభట్టు తన ఇష్టదైవమగు శ్రీరామచంద్రుని
హృదయారవిందంబున నిడి బండారు కేతనను నుతించి
నాలుకచే మడ్డుపట్టె

ఉ॥ ఆలముఁలోన నోడమికి ♦ నన్యవధూటులదిక్కు చూమికిన్
మేలిమి కైనం జొక్కమికి ♦ మెచ్చినచో వృథగామికిన్
మహింపాలితకీర్తిలోలుడగు ♦ బండరు కేతన నీతిసాటికిన్
నాలుక మడ్డుపట్టెద మనంబున రాముని నిల్పి వేడుకన్.

అని కాగిన సీసపుమడ్డు నోటబట్ట నది శీతలంబై
యమృతోపమానంబయ్యె. అదిచూచి రాజు వెఱంగుపడి
అయ్యా! నీకిట్టి యపాయంబు కావించి నీ మహత్త్వం బెఱుం
గక మూఢత్వంబున నిట్టుల సలిపితిని. నా యపరాధంబు
సహించి యనుగ్రహంబుచే నాశీర్వదింపుమనియు, నిది ఇనుప
కుతుక గాని చర్మమాంస నిర్మిత కంఠంబుగాదు. ఇట్టి మహిమ
నెచ్చటంగనుటయు, వినుటయుగూడ లేదనియు, భట్టును
బహువిధంబులం గొనియాడి బండరు కేతన మంత్రినిజూచి
నీకవియును నీవును నన్నుంగరుణింపుడనిన నామంత్రి యాజ్ఞా
పించిన దానింగయికొని యాసుకవి దీవించి యథాసుఖంబున
నుండెను. కేతన మంత్రీంద్రుండును రాజచంద్రునిచే మునుపటి
కంటె నధికంబుగా గారవింపబడుచు విశేషవిఖ్యాతింగాంచెను.

—— (౦) ——

# భారతము రచించిన తిక్కనసోమయాజి

ఉ॥ పంచమవేదమై పరఁగు భారతసంహిత యాంధ్రభాషఁగా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధిత బుద్ధినెవ్వఁడ
క్కాంచన గర్భతుల్యు నకఖండిత భక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తి వైభవ విరాజికిఁ దిక్కన సోమయాజికిన్॥

మ॥ నరులెల్లన్ నుతియింత్రు తిక్కనకవీంద్రా! నిన్నిలన్ "నా
నృషిః కురుతే కావ్య" మటంచు; సత్యమది; నీకుంగల్గె
మార్గంబు స్వర్గరసాధో భువనంబులందుఁ; బరివారంబెన్న
నందందు స్థావరముల్ జంగమముల్ ;
త్వదీయమగు నైశ్వర్యంబు సామాన్యమే ?

సీ. అంతరిక్షమున గాఢాంధకారముతోడ
నీలమేఘంబులు వ్రేలుచుండఁ
దెరనుండి వెలువడు తెఱఁగు వేసములట్లు
సౌదామినులు మింట సౌరుసేయఁ
బ్రబలిపోవెడు సమీరణతరంగములందు
నాసార మందంపు నలమికొనగఁ
బొదలతోఁ దరులతోఁ బుడమియంతయు సమ
స్థితినున్న యట్లుగాఁ జెలువు మెఱయ

గీ॥ నడచు నభిసారికలును హంతకులుఁ బురము
వెడలుచుండియుఁ బురిఁ గని నడచుచుండి
చోరులునుఁ నిన్నుఁ గానఁగా నేరరనిన
నీ నిగూఢత నెంత వర్ణింతు సుకవి॥

# పొనుగుపాటి వేంకటమంత్రి



క. ఘనకులమునఁ బొడమిన దు
ర్మనుజుం డిల నింద్యుఁడగు వమన మూర్ధ్వముఖం
బున వెడలి నుంచిదగునా
విను మవహిత! పొన్గుపాటి వేంకటమంత్రీ!

క. కినుక మెయిఁ దన్నులాడఁగ
మొనకట్టిన సరియె గుఱ్ఱమున్ గాడిదయున్
ఘనుఁ డల్పుఁడు సరి యగుదురె
విను మవహిత! పొన్గుపాటి వేంకటమంత్రీ!

క. బలవంతుఁడు బలహీనుఁడు
పొలియుదు రిదితప్పు? నల్లపూసలు ముత్యాల్
దొలఁగుఁగద! మగఁడుపోయిన
వెలఁదుకమన్ బొన్గుపాటి వేంకటమంత్రీ!

క. జలచరము లబ్ధిఁ బొడమవె?
జలరాశికి మోదకరుఁడు చంద్రుం డొకఁడే
కుల ముద్ధరింప నొకడే
విలసద్యశ! పొన్గుపాటి వేంకటమంత్రీ!

క. వలరాచపనికిఁ గాదా
వెలవెలఁదుక పాన్పు నెక్కి విటుఁడు సహించున్
జల మేల కార్యవాదికి
సలసద్యశ! పొన్గుపాటి వేంకటమంత్రీ!



# ఆంధ్రరాష్ట్ర ప్రధానామాత్య శేఖరుడు

## శ్రీయుత టంగుటూరి ప్రకాశం పంతులుగారు



భారత నాయకాగ్రగణ్యులశ్రేణి నలంకరించిన మహా యోధుడు. మహాత్మాజి పిలుపు ఆలకించి ఇదం బ్రాహ్మ్య మిదంక్షాత్రం అను భార్గవరాముని కైవడి భారతస్వాతంత్ర్య సమరములోదూకి బ్రిటన్ తుపాకిగుండ్ల అగ్నివర్షముకు వక్ష స్థలినినొసంగి దక్షిణభారతదేశమునుంచి బ్రిటన్ ప్రభుత్వమును పారద్రోలిన వీరాధి వీరుడు. ధైర్యోత్తేజాలు, అపార ఆత్మ బలము మూర్తీభవించిన మహాయోధుడు.

ఆ. బ్రతుకవచ్చుగాక బహుబంధనములైన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన జెడుగాక పడుగాక
మాటదిరుగలేరు మానధనులు.

అట్లుగానే శ్రీ ప్రకాశంపంతులుగారు భారతదేశ స్వాతంత్ర్య సమరముకు తమ జీవిత సర్వస్వాన్ని ధారవోసిన మహాత్యాగి. కష్టంబులు లెక్కగొనక కృషి సలుపుచుండు వారే ధీరాగ్రేసరులు. అగ్నితప్తమయినగాని బంగారు వన్నె కెక్కదు. పాలనుదఱచినగాని వెన్న రాదు. ప్రసూతి కష్టంబు లనుభవించిగాని సుపుత్రుని జూచుభాగ్యము తల్లికి జేకూరదు. అట్లే కష్ట పరంపరలచేగాని వ్యక్తులు వన్నెకెక్క రాణింపరు. కష్టములు నెన్నివచ్చినను శాంతముతో నెదుర్కొనగలిగిన

నారే ధీమంతులు శ్రీ ప్రకాశం పంతులు గారట్లు భవిష్యదాంధ్యమును నవభాగత నిర్మాణముపట్ల జేకూర్చుటయందు అగ్ని పరీక్షకులోనైన తేజోమూర్తి దేశప్రజలు వారిపై కురిపించిన అనంతితప్రేమవాత్సల్యాదులకు గౌరవపురస్సరంగా ఆంధ్రకేసరి యనుబిరుదమును శ్రీ ప్రకాశంపంతులుగారికి యొసంగియుండిరి.

ఆంధ్రరాష్ట్ర విభజనపట్ల ఆంధ్రేతరులు కల్పించిన చదరంగపు యెత్తులు హనుమంతునిముందు కుప్పిగంతులు సాగనట్లు జేసిన మహా మేధానిధి ఆత్మబలము ముందు ఆయుధాలు పనికిరావనిజాటిన వీరాగ్రగణ్యుండు. వృద్ధులైయుండియు జనసత్వములు సన్నగిల్లినను, నిత్యయౌవ్వనుడు మార్కండేయునివలె శ్రీ ప్రకాశంపంతులుగారట్లు ఆంధ్ర ప్రభుత్వమున ప్రధానామాత్యశేఖరులుగా విరాజిల్లగల్గుచుండెను. విశాల హృదయుడు నిష్కల్మష శిరోమణి, ఆంధ్రులకు కీర్తిదెచ్చిన ఆంధ్రకేసరి, శ్రీయుత టంగుటూరి ప్రకాశంపంతులుగారి ఋణము ఎవ్వరు దీర్చగలుగుదురు. అట్టి పుత్రరత్నం గన్న ఆంధ్రమాత ధన్యురాలుగాకుండునా ?

---

చ॥ సలిలవిహారు లిద్దరును । సంతత కానన చారులిద్దరున్
వెలయగ విప్రులిద్దరును । వీర పరాక్రమశాలు లిద్దరున్
బొలుతుల డాయువాడొకడు।భూమినిబుట్టెడువాడునొక్కడున్
జెలువుగ మీకభీష్ట ఫలసిద్ధి ఘటింతు రనంత కాలమున్
(తా॥ దశావతారములు)

# భారతప్రభుత్వ ఉపాధ్యక్షుడు
# శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ



ఆర్వేల అమాత్యశేఖరుల వంశమును జెందిన విజ్ఞాన నిధి విద్యుత్కాంతితోఁగూడిన రాధాకృష్ణునివర్చస్సునుబట్టియు జనన కాలమునుంచియు ఇమ్మహారత్నము గొప్ప యోధాగ్రేసరుడగునని యూహించి రాధాకృష్ణయను నామంబిడిరి.

ఆ మేధానిధి తన చిఱుతప్రాయమునందే ఆంగ్ల విద్య లోను వేదాంత శాస్త్రమునందును సర్వజ్ఞుడుగా వినుతి కెక్కెను. ఆతపస్సంపన్నుని హృదయము అమృతకలశమయమై నొప్పుటచేత జనబాహుళ్యముపట్ల ఆయన ప్రదర్శించు విజ్ఞాన విశిష్టగుణములు ప్రజలను ముగ్ధులుగా జేయగలుగుచుండెను. భారత యుద్ధమున శ్రీకృష్ణుడు అర్జునునకు ఏ గీతారహస్యము ఉపదేశింపజేసి యుండగలెనో ఆ గీతా తత్వశాస్త్రము ప్రాచ్య ఖండవాసుల హృదయములయందు వెదజల్లి ప్రాచ్యఖండ ప్రజలను వ్యామోహింపజేసియుండిన వేదాంత సార్వభౌముడు. భారతరాయబారిగా నేర్పడి సోవియెట్ రష్యా ప్రభుత్వముతో ప్రపంచ శాంతి వాతావరణమునను సుముఖులుగా సోవియెట్ ప్రభుత్వంను యొనర్చజేసిన రాజకీయతత్వవేత్త. ఖండఖండాంతరములయందుగల విశ్వ విద్యాలయములోని విద్యార్థులను విజ్ఞానతేజఃపుంజము వెల్లివిరియునట్లు, వాక్యామృతము గావించిన రాజ్యాంగనిపుణుండు అట్టి రాజ్యాంగనిపుణుండు భారత ప్రభుత్వ ఉపాధ్యక్షపీఠము నలంకరించుటచే ఆంధ్రమాత నుప్పొంగుచున్నది.



# శ్రీయుత భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు మధ్య ప్రదేశ్ గవర్నరు.

మహాత్మా గాంధిజీకి మంత్రిమణియై సెనలేని యశశ్చంద్రికలకు నిలయమై భారత వీరులలో అగ్రగణ్యులై కాంగ్రెస్ సభలలో మేటియై కాంగ్రెస్ తీర్మానములు పకడ్బందీతో అమలుజరిపించిన ధీశిరోమణి. భారతదేశములో భాషారాష్ట్రములు నేర్పడుటకు ప్రథమముననే పూనుకున్న మహామేధానిధి. హాస్యోక్తులతోను, చమత్కారంతో మనోజ్ఞంగా అద్భుతమైన నూతనోత్తేజం అంకురించు ఉపన్యాస వాహినితోను యువకులనందరిని తీర్చి దిద్దడానికి మహోచ్ఛస్థితిని ఆర్జించిన ఉజ్వల మేధానిధి. సత్ప్రవర్తన, ఆత్మస్థైర్యం పుష్కలంగా నేర్పడి యుండిన పురుషు.

ప్రప్రథముగా బందరులో ఆంధ్ర జాతీయ కళాశాలను, ఆంధ్రా బ్యాంకును, భీమాసంస్థలు, సహకార సంస్థలు మొదలగు అమోఘమైన ఉద్యమములను నెలకొల్పి బ్రిటనుప్రభుత్వముచు భారతదేశమునుండి తర్లింపజేయగలగిన శ్రీ పట్టాభిగారి పట్లను దశరథ తనయుండైన శ్రీరాముని యెడలను నిరువురిలో నెనరిపట్ల నే వ్యత్యాసములు గానవచ్చుచున్నవి. శ్రీరాముడు క్షత్రియ వంశమువాడు. రాజ్యమేలిన రాజు. శ్రీ పట్టాభిగారి మూలపురుషుండైన భోగనామా మాత్యుండు, రాజ్యమేలుట

చేత భోగరాజుయని గృహనామము పట్టాభిగారిపట్ల జెప్పబడి నది. శ్రీరామునినామగోత్రము, శ్రీ పట్టాభిగారి నామగోత్రము నొకటిగా నేర్పడి ఉభయులు ఏకనామ సగోత్రీయులుగా యుండగలిగిరి. శ్రీ పట్టాభిగారు సంస్థాన ప్రజాసమూహముతో దండువెడలి సంస్థానాధీశుల రాక్షసకృత్యములను దునిమాడిన శ్రీరామావతారుడు. శ్రీరామునికి రాజ్యపట్టాభిషేకము జేయ వలెనని దశరథుడు దలపెట్టగా ఆ రాజ్య పట్టాభిషేకముకు విఘ్నము సంభవిల్లగలిగినది. అలాగుననే భారతజనకుండైన మహాత్మాగాంధిజీ శ్రీ పట్టాభిగారికి రాష్ట్రపతిగా పట్టాభిషేకము జేయవలెనని దలపెట్టగా ఆ రాష్ట్రపతి పట్టాభిషేకముకుగూడ శ్రీరాముని పట్టాభిషేకమువలె విఘ్నము గాంచగలిగినది.

దశరథుని అనంతరము శ్రీరాముడు రాజ్యపట్టాభి షేకమునొందినట్లుగా భారతజనకుండైన గాంధిజీ అస్తమించిన వెనుక పట్టాభిగారట్లు జయపురమున రాష్ట్రపతిగా పట్టాభి షేకము నొందగలిగియుండెను. శ్రీరాముడు శ్రీ పట్టాభిగారిపట్ల ప్రతిఫలించుచుండుటచేత నేగవర్నరుపీఠమునునాగపూరునందు శ్రీ పట్టాభిగారు నలంకరించగలిగి యుండిరి.

ఆంధ్రమాత అనుంగతనయులు భారతదేశ రాజ్య పాలన యొనర్చుచుండుటచేత ఆంధ్రదేశము మితిలేనిఆనందము నొందుచున్నది.

---

# శ్రీయుత ప్రత్తిపాటి సత్యనారాయణగారు
# మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి

విద్యా వినయ సద్గుణంబులచే కీర్తి వెదజల్లుచు, యాచకసమూహంబునకు గల్పతరువై వెనలేని కీర్తి విరాజిల్లు విద్వత్కుటుంబమగు ఆర్వేల అమాత్యశేఖరుల వంశమున శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణగారు జన్మించిరి. పువ్వు పుట్టగనే పరిమళించునను ఆర్యోక్తి ననుసరించి వారి వారి భావిమహాత్మ్య చిహ్నములు, బాల్యమునందే గోచరించుచుండును. అట్లే నొక్కొక్క వంశమునందు నొక్కొక్కరు జన్మించి తమ తమ వంశౌన్నత్యంబును జాటుచుందురు.

శ్రీ సత్యనారాయణగారి జననీ జనకులు మహా తపోధనులు. బ్రహ్మతేజస్సుతోగూడిన తమ ముద్దు తనయునకు సత్యనారాయణయను భగవన్నామమును ధరింపజేసియుండిరి. శ్రీ సత్యనారాయణగారు చిన్ననాటనే విద్యాభ్యాసమునకు గడంగి విశ్వవిద్యాలయములలో విద్యాభివృద్ధిగాంచుచూ పట్టభద్రుడై న్యాయవాది పరీక్షలో ఉత్తీర్ణుండై న్యాయమూర్తి పీఠముగైకొన్న దేవాంశ సంభూతుడు. దుష్టశిక్షణ శిష్టరక్షణ జేయుచుండిన అనంతిత ధీశాలి. శ్రీరామచంద్రుని వింటినారి చప్పుడుకే రాక్షసమూకలన్నియు పలాయనమైనట్లు న్యాయమూర్తి శ్రీ సత్యనారాయణగారి ఎదుట అవినీతివ్యూహములు దూదిపింజములవలె గాలి కెగిరిపోవుచున్నవి. అసమానశౌర్య ధైర్యములచే ధర్మాధర్మ విచక్షణతో మార్తాండునివలె న్యాయమూర్తి పీఠమున శ్రీ సత్యనారాయణగారు విరాజిల్లగలుగుచుండిరి. శ్రీ సత్యనారాయణమూర్తియొక్క గుణశీల సంస్కృతులే, శ్రీసత్యనారాయణగారిపట్ల ప్రతిఫలించుచున్నవి.

# దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

శ్రీకృష్ణపరమాత్ముని నామముచే విరాజిల్లు కృష్ణామండలముకుజెందిన యలమర్రు అగ్రహారము, దేశోద్ధారక నాగేశ్వరరావుగారి జన్మస్థానము. శ్రీ పంతులుగారియొక్క యశోధనము దశ దిశలను వ్యాపింపజేయుటకొరకు పంతులుగారి అదృష్టచక్రము పంతులుగారిని బొంబాయి పట్టణముకు తర్లించుకొని పోగలిగినది. బొంబాయి పట్టణమున మందులు వ్యాపారముజేయు విలియం అండ్ కో, పరోపాదేశస్తుడు తన వ్యాపారములపై మేనేజరుపదవి శ్రీపంతులుగారికి యొసంగెను కొన్నినాళ్ళకు విలియందొర తన మాతృదేశమును సరుదెంచునపుడు తన మందులషాపు వ్యాపారము శ్రీ పంతులుగారికి ప్రేమపూర్వకముగ నర్పించగలిగెను.

అటుపిమ్మట శ్రీ పంతులుగారి కుశాగ్రబుద్ధిచే నొక మందును గనిపెట్టి ఆ మందుకు అమృతాంజనమను నామం బిడిరి. ఆ అమృతాంజనముయొక్క అమోఘగుణము వస్తుప్రదర్శనములయందు శేముషీప్రతిభనుజగత్తుకుచాటబడుటయేగాక శ్రీ పంతులుగారికి అమృతాంజనమే భాగ్యరేఖయై వెల్లివిరియ గురియుచున్నది.

ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రము బడయుటకు ఆంధ్రపత్రిక ముఖ్యావసరమని, శ్రీ పంతులుగారు సంకల్పించుకొని బొంబాయి పట్టణమునందు ఆంధ్ర వారపత్రికను 1907 వత్సరమున స్థాపించగలిగి ఆంధ్రప్రజలలోని నిద్రాణమైన శక్తులను

మేల్కొల్పి ఆంధ్రులఘనత ప్రపంచానికి శంఖము పూరించినది దేశోద్ధారకుడే. ఆంధ్రేతరులు ఆంధ్రులనుజేయు దుశ్చర్యలను ఆంధ్ర ప్రజాహృదయాన్ని ఆకర్షింపబడుటకు పల్లెపల్లెలకు పోష్టల్ సౌకర్యము లొనగూర్పింప జేసినది దేశోద్ధారకుడే. బొంబాయినగరము ఆంధ్రదేశమునకు దూరమని శ్రీ పంతులు గారు దలంచి ఆంధ్రపత్రిక కార్యస్థానము 1914 సంవత్సరమున మద్రాసు పట్టణమునకు నెలకొల్పి ఆంధ్ర దైనిక పత్రికగ నేర్పరచి మద్రాసునగరములో ప్రచురించు దిన పత్రికలచందా కంటె తక్కువ ఖరీదుతో ఆంధ్రదైనిక పత్రికనడుపుచుండుట చేత కొన్ని వేలు దండుగలు ఆంధ్రదైనికపత్రికకు వచ్చుచుండు టయు ఆవచ్చినదండుగలు అమృతాంజనమునుండి సరిదిద్దుటయు జరిగెను. నటుపిమ్మట ఆంధ్ర పత్రిక వెల హెచ్చుచేయుటచే ఆంధ్రపత్రికకు ఆదాయము వృద్ధిచెందగలిగెను. ఆంధ్రదేశము నందు ఏ ధర్మసంస్థ స్థాపించి యుండినను ఆ ధర్మసంస్థకు దేశోద్ధారకుని సహాయసంపదలు బడయని ధర్మసంస్థ లేనేలేదు.

దేశోద్ధారకుడు కాంగ్రెసు సభ్యుడేగాక కాంగ్రెసువర్కింగు కమిటీసభ్యులుగూడ. కాంగ్రెసు వర్కింగు కమిటీ శాసనోల్లంఘనోద్యమ తీర్మానములు ఆంధ్రపత్రికలో ప్రచురించుట చేత రాజద్రోహమనిఎంచి ఆంధ్రపత్రికాధిపతియైన దేశోద్ధారకునిచే బ్రిటిషుప్రభుత్వము కొన్ని వేలు ధరావతు కట్టించు కొనగలిగినది. అటుపిమ్మట కాంగ్రెసు వర్కింగు కమిటీ క్విట్ ఇండియా తీర్మానమును గావించినందున కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులందరిని, శ్రీ దేశోద్ధారకుని జైలుకు బ్రిటిషు ప్రభుత్వము పంపియుండెను. దేశసేవాపరాయణుడును కరుణార్ద్రహృదయుడు సుగుణవాత్సల్యగంభీరుడు త్యాగధనుడు ఆంధ్రదేశభాగ్యమును

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి, ఆంధ్ర ప్రాభవాన్ని జగత్తున చాటిన దేశోద్ధారకుడు జైలుశిక్ష ననుభవించుచుండు రోజులలో ప్రజాసమూహము ప్రతినిత్యము జైలుకడకు నరుదెంచి శ్రీ పంతులుగారికి పండ్లు ఫలహారములు మరికొన్ని తినుబడి వస్తువులు బుట్టలలో నిమిడ్చి దేశోద్ధారకునికి కానుకగా నర్పించుటయు ఆ పండ్లు ఫలహారములు దేశోద్ధారకునితో పాటు ఇతర ఖైదీలుగూడ నిత్యము సేవించుచూ రాజభోగముతో శ్రీ పంతులుగారినీడను సుఖముబడయుచుండు! ఖైదీలు తమతో పాటు కొంతకాలము దేశోద్ధారకుని జైలులో యుండవలెనని తలంచుటజూడ ధర్మరాజు కించెత్ అనృతముపలికెనని యమలోకమును ధర్మరాజును దీసుకొనిపోబడినపుడు యమబాధలు ననుభవించు పాపులు, ధర్మరాజు తనువుయందుగల సుగంధములచే యమబాధలుతొలగి ధర్మరాజును యమలోకమునయుండవలెనని అక్కడ పాపులు కోరిన కోర్కెలుగా దేశోద్ధారకుని పట్ల జైలు ఖైదీలు అట్లు దలపోసి యుండగలిగిరి.

దేశోద్ధారకుడు జైలుకు వెళ్లకపూర్వము ప్రతి నెలకు వచ్చేఆదాయము దానధర్మముల వగైరాలకు శ్రీ పంతులుగారు వినియోగపరచుచుండిరి. జైలుశిక్షను ననుభవించి శ్రీపంతులుగారు మద్రాసుపట్టణమునకు నరుదెంచినపుడు ఆంధ్రపత్రిక వగైరాలవల్లవచ్చిన ఆదాయము షుమారు లక్ష రూప్యముల ధనమును శ్రీ బాగుమందిరమున నిల్వజేయగలిగిరి.

ఆంధ్రదేశాన్ని విజ్ఞానవంతముగా జేయగల్గినది దేశోద్ధారకుడే. అట్టి విజ్ఞానవంతులు ఆంధ్ర మహాజనులగుటచేతనే బహుజన నాయకత్వమని ఆంధ్రులకు గాంధిజీ నామకరణమొనర్చియుండెను.

# పింగళి సూరనామాత్యుడు

కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, రాఘవ పాండవీయము మొదలగు గ్రంథములను రచించిన మహాకవి.

ఉ॥ పింగళి లింగమంత్రివరు బిడ్డకు సూరనకుం బదాబ్జరే
ఖంగల కాంతికే వలచి కైవసమయ్యెను రాజ్యలక్ష్మి దా
బంగరుకామకుం చెలును బల్లకియు న్మోదమైన యాత్మ స
ర్వాంగ సమృద్ధితోడ సిరికంబుజ రేఖల ప్రేమ వింతయే॥

తే॥ సూరవిభుడైన పింగళి సూరవిభుని
దొరయ బోడోరుడలవేల్పు దొరయకాని
యతనిదానము సిరికిని యతనిదాన
మరులప్పుడు దాన సమర్థులైరి.

క॥ సూరయమంత్రికి గలిగెను
సూరయమంత్రియ యనంగ సుతరత్నము కం
ఠీరవమున కెందును గం
ఠీరవము జనించునట్టి నియమము దోపన్.

ఈ పింగళివంశమునందు అఖిలభారత సాహిత్య పరిషత్ శిష్టసభాసభ్యులు, ఆకాశవాణి వైజ్ఞానిక కార్యవిధాన నిర్ణేతలు విశ్వకళాప్రపూర్ణులు, ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు ఆంధ్రభాషా సాహిత్యౌన్నత్యమును దిగ్దిగంతముల వ్యాపింప జేసి తమ వంశము కీర్తి కౌముదికి ద్విగుణీకృతము జేయు ప్రతిభావంతులు. వీరిది విజయవాడ కృష్ణా మండలము.

ఆ పింగళి వంశమునందు భగవత్ భక్తిపరులైన శ్రీ వేంకట కృష్ణయామాత్యుండును, శ్రీమతి వెంకమాంబయను దంపతులు గలరు. ఆ దంపతుల పుణ్యవశమున వారికి తనయుండుదయించగా విష్ణుమూర్తికి శయ్యనై యుండిన శేషుని నామమును తమ ముద్దుబిడ్డను ధరింపజేసియుండిరి.

తల్లి దండ్రులు తమకు పెట్టిన భగవన్ నామమును శ్రీ శేషగిరిరావుగారు గుర్తెరింగి యశోధనార్జనకొరకు వైద్య విద్యాలయములకేగి వైద్యవిద్యాభ్యాసమునొనరించి పట్టములు బడసి ఆరోగ్యహీనులైన ప్రజలకు అమృతమునొసంగి ఆరోగ్యవంతులుగా జేయుచుండిన శిరోరత్నము తల్లిదండ్రులు తమకు పెట్టిన దైవనామమునకు కళంకము జేయనివ్వని దైవాంశ సంభూతుడు. బీదలపాలిట కల్పవృక్షము. ఆర్తజనులకు ఆపద్బాంధవుడు. ఆంధ్రమాతకు అనుంగుతనయుడు. అమృతరాశియందుద్భవించిన ఆదిశేషుడు. శ్రీ శేషగిరిరావుగారి మందిరము గాంచిన శ్రీదేవికి నివాసమని స్ఫురించగలదు. శ్రీ శేషగిరిరావుగారిది గుడివాడ. కృష్ణా మండలము. డాక్టరు శేషగిరిరావు పంతులుగారి ప్రథమ సోదరుడు శ్రీ సీతాపతిరావుగారు కరణము గ్రామాభరణమగు విలేజి ఆఫీసరు. ద్వితీయ సోదరుడు శ్రీ సత్యనారాయణగారు కాంగ్రెసు సభ్యులు. శ్రీకృష్ణ జన్మస్థానమలంకరించిన కాంగ్రెసు వీరుడు. శ్రీ శేషగిరిరావుగారి పినతండ్రిగారైన కుటుంబరావుగారు అరితేరిన ప్రభుత్వఉద్యోగులు శ్రీ కుటుంబరావుగారి తనయులు ప్రభుత్వపాలనయందు గౌరవయుద్యోగులుగా యుండిరి.

——(o)——

# శ్రీ బూర్గుల రామకృష్ణరావు పంతులుగారు

## హైదరాబాదు ప్రధానామాత్యశేఖరుడు.



అక్కన్న మాదన్న మంత్రిశేఖరుల వంశమునను జెందిన అమాత్యశేఖరుడు. రజాకార్ల హయాములో శ్రీ పంతులుగారి శక్తిసామర్థ్యాలు వెల్లడించి క్షణ క్షణము నుదయించు క్లిష్ట సమస్య వైపరీత్యములను దరికిజేరనివ్వకుండా ప్రజలను రక్షించుటయందు అసమాన శౌర్య ధైర్యములతో రజాకార్లను వెంటాడి జనబాహుళ్యాన్ని కరుణాకరహృదయముతో రక్షణ జేయించియుండిన ప్రజారక్షకుండు.

హైదరాబాద్ కాంగ్రెసు సభ్యులలో అనంత కీర్తి వహించిన ప్రతిభాశాలి. నాలుగైదుభాషల విద్యలయందు ప్రవీణతవహించిన విద్వన్మహామహుండు. న్యాయవాదిపరీక్షలో ప్రతిభగావించిన న్యాయశాస్త్ర కోవిదుడు. కవిత్వమునందు పేరెన్నికగన్న కవిసార్వభౌముడు. సచ్ఛీలము సత్ప్రవర్తనయందు సఫలీకృతముదాల్చిన సత్యచారిత్రుడు. బీదసాదలను భూములనొసంగజేయించియుండిన ధార్మికచక్రవర్తి. సంస్థాన ప్రజలను కన్నబిడ్డలవలె ఆదరించి చిరయశస్సునార్జించిన సచివోత్తముడు.

బుద్ధిబలములో బృహస్పతికి తుల్యుండైన శ్రీ పంతులుగారు విశాలాంధ్ర నిర్మాణమునకు గట్టి పునాదులు నిర్మించి భారతదేశములో మహోన్నతస్థానముగా విశాలాంధ్ర విరాజిల్లుటను శరవేగముతో కార్యనిర్వహణ నేర్పాటులనుగావించి ఆంధ్ర మహాజనుల కోర్కెలను సఫలీకృతము జేయగల్గునని ఆంధ్రమాత దలంచుచున్నది.

# శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు

ఆర్వేల అమాత్యశేఖరుల వంశమునం దుద్భవించిన యుగపురుషుండు. ఆంధ్రదేశమునందు ప్రప్రథమముగా సంఘ సంస్కరణకుబూని వితంతువులైన బాలికలకు బ్రహ్మసమాజ మతముతో వివాహములు జేయించిన ఆంధ్రపితామహుడు. అచంచల దీక్షావ్రతముతో స్త్రీ సమాజముల స్థాపించ జేయ గలిగి ఆంధ్ర నారీలోక పురోభివృద్ధికి ఆచంద్రార్కముగ పునాదులు నిర్మించిన మహామేధానిధి. మత సంస్కరణపట్ల వర్ణ భేదముల నంతరింప జేయుటకొరకు ఏటికి ఎదురీది పూర్వా చార సాంప్రదాయకములను పారద్రోలి బాల వితంతువులను పతిభిక్ష పెట్టిన భాగ్యశీలుడు. వేశ్యా సంఘములో కన్నెరిక ఆచారములను పునాదివేళ్లతో పెరికివైచి వేశ్యా సంఘమునకు గౌరవ ప్రతిష్ఠలు గాంచజేసిన మహావీరుడు. సంఘ సంస్కరణ ప్రతికూల ఘటనా ఘటికులను సాధించుటకు వీరత్వముదాల్చి ప్రజల హృదయములలో నూతన వికాసమును చెచ్చుటకు పత్రికలు, గ్రంథములు, దేశముపై విరజల్లి దేశప్రజలను విజ్ఞాన హృదయులుగా చేయగలిగిన దీనజన బాంధవుడు. ఆంధ్రలోకము కొరకు ఆ ధీరవరేణ్యుండు రచించజేసియుండిన ప్రహసనాలు, ప్రబంధాలు, నాటకాలు, నవలలు కవీశ్వరుల జీవితగాధలు గాగల పెక్కు గ్రంథరాజములను శ్రీ పంతులు గారు స్వశక్తి ప్రతిభానంతముచే రంజింప జేయగలిగి ఆంధ్ర ప్రజల ఆదరణావృద్ధి గాంచగలిగిన యశస్సు చంద్రుడు. అట్టి యశస్సుచంద్రునిగన్న ఆంధ్రమాత ఎంతటి ప్రతిభాశాలియో ఎంతటి కీర్తిశాలియో లోకమే నిర్ణయ మొసంగగలదు.

---

# శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు

బారిష్టరు, శారదానికేతనము - గుంటూరు.



ఏ మహాత్ముడు తన నైపుణ్యముచే నైశ్వర్యము సద్వినియోగపఱచెనో ఏ పుణ్యాత్ముడు పరోపకారమును దీక్షబూని అనాథులైయుండిన స్త్రీసంఘమునకు జననీ జనకుడై అన్నవస్త్రము లొసంగి, తమ కన్నబిడ్డలవలె ముద్దు మురిపెములతో ఆదరించి విద్యా విజ్ఞానములతో ప్రవీణులుగా జేయించుటకు కళాశాలలను నెలకొల్పియుండెనో ఏ తపోధనుడు సీతా, సావిత్రి, దయమంతి మొదలగు భారత నారీమణుల స్వయంవరమువలెనే శారదా నికేతనమున నిత్య కల్యాణము పచ్చని తోరణంబులతో ప్రతినిత్యము కన్యాదానములు కావించగల్గుచుండెనో ఆ ఆంధ్ర జనకుడు నెంతటి ధన్యుండో.

ఏ నక్షత్రమందు జన్మించిన యశస్కాముడో ఏమని దలంచనగును. ఆకాశమునకు రవియు, రాత్రికి జంద్రుడును, కాసారమునకు బద్మములు ప్రకాశవంతములు. అట్లే ఆంధ్ర దేశమున ఆర్వేల అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ ఉన్నవ దంపతులట్లు శ్రీ శారదా నికేతనమున విరాజిల్ల గల్గుచుండిరి. శ్రీ లక్ష్మీనారాయణ దంపతుల నామవిశేషము ఎట్లుగా నేర్పడి యున్నది. లక్ష్మి అన విష్ణుమూర్తి భార్య. నారాయణ అన విష్ణువు. పాలసముద్రమునందు పవళించిన శ్రీ మహావిష్ణువు నామముగలిగిన దేవాంశసంభూతుడు. అట్టి భగవన్ నామము గల చక్రధరుండగుటచేతనే దేశ దేశములందును పూజలంద గలిగిరి.

70

# డాక్టరు తెన్నేటి చలపతిరావుపంతులుగారు

విజయవాడ పురపాలకసంఘ ఛైర్మన్.

దేశము నుద్ధరించుటకు తమసర్వస్వము త్యాగమొనర్చి కీర్తి ప్రతిష్ఠలు నందిన ఆర్వేల అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ చలపతిరావు పంతులుగారు జన్మించిరి. ప్రజా సేవపట్లను, మనోధైర్యమునందును, ఉత్సాహము నెడలను, సత్ప్రవర్తన లోను యప్రతిమానతేజోవంతుండై వన్నెగాంచిన శ్రీ చలపతి రావు పంతులుగారిని ఛైర్మన్‌గా విజయవాడ పురపాలక సంఘము జేయగలిగినది. విద్యుత్కాంతి దీప తోరణంబులతో నొకవైపును, విజ్ఞాన క్షీరంబులు యొసంగు గ్రంథాలయములు మరియొక వైపునను, ప్రజలను దాహోదమును మంచినీటి పంపులు వేరొక వైపునను, మృదువులై నేర్పడియుండిన రాజ బాటల సమూహముతో పట్టణము శోభాయమానముగా విరాజిల్ల గలుచున్నది.

శ్రీ పంతులుగారు తమ వక్తృత్వసామర్థ్యముచే ప్రజలను యానంద పరవశులగునట్లు ఉపన్యాస పరంపరలు కురిపించు చుండెడి మహామేధావి. మద్రాసు రాజధాని పురపాలక సంఘానికి సంఘాధ్యక్షునుగా శ్రీ చలపతిరావు పంతులుగారిని ఎన్నుకోగలిగియుండిరి. విజయవాడ పట్టణము అత్యున్నత ప్రతిభగాంచుటకు శ్రీ చలపతిరావు పంతులుగారి కుశాగ్ర బుద్ధియేయని నిరూపింపబడినది. శ్రీ పంతులుగారు ప్రజాసేవ జేయుటకు వైద్యాలయమునిర్మించి ఆరోగ్యహీనులైన ప్రజలకు ఔషధములనొసంగి ఆరోగ్యవంతులుగా జేయుచుండిన ధర్మ శాలి. బీదలపాలిట కల్పవృక్షము. ప్రజల సౌభాగ్యాలు ఇనుమడింపజేయుటకు గట్టిపునాదులు వేసిన మేటిధీరుండు.

# శ్రీ బలభద్రపాత్రుని హనుమంతరావుపంతులుగారు

ఇంపీరియల్ బ్యాంకు మేనేజరు, నంద్యాల.



సౌందర్యము సర్వదా ఆనందదాయకము. శిలలయం
దమూల్య రత్నంబులును ఋతువులయందు వసంత ఋతువును
రాత్రులయందు షోడశకళా పరిపూర్ణుడైన చంద్రుడు నాహ్లాద
కరంబులు. అట్లే మానవులయందు దేశాభిమానులు రాష్ట్రాభి
మానులు, కవిసార్వభౌములు, రాజనీతి విజ్ఞానధనులు,
ధార్మిక చక్రవర్తులు, పండితశ్రేష్ఠులు సర్వదా శోభాయ
మానముతో విరాజిల్ల గలుగుచుందురు.

అట్టి శోభాయమానముతో విరాజిల్లు పండిత శ్రేష్ఠుండును
విజ్ఞాన దురంధరుండైన శ్రీ హనుమంతరావు పంతులుగారు
భారతాది గ్రంథరాజములను జదివి నవరత్నము లొలుకు
అమూల్య మాధుర్యములతో అర్థ తాత్పర్యములు దెల్పి ప్రజ
లను ఆనందసాగరమునో ముంచెడి భక్తాగ్రేసరుండు. గ్రంథ
పఠన ఉత్సాహాన్ని రేకెత్తించి ప్రజల ఒళ్ళు జల్దరింప జేయ
గలిగిన మహామహుడు. శ్రీ హనుమంతరావు పంతులు
గారి తనువు సువర్ణముచే నిర్మితమైన సౌందర్య విగ్రహము.
ఆ సౌందర్యమూర్తి వాక్యములే ప్రజలను దిగ్భ్రాంతులుగా
జేయబడుచున్నవి. శ్రీ ఆంజనేయుని సంగీతమును రాళ్లు కరగి
నట్లువలెనే శ్రీహనుమంతరావు పంతులుగారి గానవిశేషమును
శిలలు కరగునని భావించగలుగుచుందురు. శ్రీ ఆంజనేయుని
గోత్రనామములు శ్రీ హనుమంతరావు పంతులుగారి గోత్ర
నామములు నొకటిగా నేర్పడి ఉభయులు ఏకనామ సగోత్రీ
యులుగా విరాజిల్ల గల్గుచుండిరి.

సీ॥ ఇల గొండ వీటిలో
వెలయు ప్రధానుండు
భవ్యుండు బలభద్ర
పాత్రఘనుడు

అట్టి కొండవీటిసీమను పాలించిన అమాత్యశేఖరుని వంశమునందు మహాతపోధనుండైన హనుమంతురావుపంతులు గారు జన్మించి ఆబలభద్రపాత్రుని వంశము తరింప జేసియుండిన పావనచరితుండు.

—(o)—

అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు
కల్పక బలికర్ణకల శార్ణవోదీర్ణ వితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయ సతతనిర్వ్యాజహారి పరోపకారు లార్వేలవారు
ఘన దుర్ఘటస్వామికార్యనిర్వాహణ ప్రవీణలార్వేలవారు
వినుతగర్వాపహారు లార్వేలవారు
లట్టి యార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్స గోత్రారవిందహేళి
మహిత గుణశాలి వల్లభామాత్యమాళి.

# శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారు



## విజయవాడ.

దేశములోని మహాకార్యములను సాధించి అఖండ విజయాన్ని గన్న అమాత్యశేఖరుల వంశమున శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగా రుద్భవించిరి

శ్రీ పంతులుగారు గొప్ప న్యాయవాదియై యుండి, కాంగ్రెసు సభ్యులై శ్రీకృష్ణ జన్మస్థానమును సందర్శించిన ధీరోత్తముడు. శాసన సభలలో పెక్కు కాలము ప్రజాసేవ జేసి, ప్రజలకు మహోపకారము జేయించి యుండిన సాధు శీలుడు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ సిండికేటు సభ్యులుగా యుండి ఫ్రెంచిదేశము, అమెరికా రాష్ట్రములగూర్చి గ్రంథములు వ్రాసియుండిన పండితవర్యుండు. విజయవాడ పురపాలకసంఘముకు చైర్మన్ పదవిని స్వీకరించి విజయవాడ పట్టణ మభివృద్ధికి, నిరంతరము సేవజేసి విజయవాడ ప్రజల అభినందనములు గైకొనగలిగి, లక్షలకొలది ద్రవ్యముతో నిర్మింపబడిన విజయవాడ మార్కెట్టును శ్రీ కాళేశ్వరరావు మార్కెట్టుగా నామము వహింపబడిన ప్రజాబాంధవుడు.

పెండ్లి అయిన పురుషులు, తమ ధర్మపత్నులను విడనాడి మరియొక స్త్రీని వివాహము తమ ఇష్టప్రకారము జేసుకొన గూడదని, చట్టములు జేయించి స్త్రీ సంఘమునకు అమోఘమైన ఉపకారములు జేయించి చరితార్థుడైన పావన చారిత్రుడు. విశాలాంధ్ర నిర్మాణమునకు కంకణము ధరించి ఆంధ్రమాతను ధన్యురాలుగా జేయుటకు పూనుకొన్న దివ్య మంగళ స్వరూపుడు.

# శ్రీ తుమ్మలపల్లి హరినారాయణ పంతులుగారియొక్క వంశము,

విజయవాడ.

—oo—

అఖండకీర్తిచే విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ హరినారాయణ పంతులుగా రుద్భవించిరి.

శ్రీ పంతులుగారు డాక్టరు పరీక్షలో నుత్తీర్ణులై జిల్లా డాక్టరుగాయుండి ప్రజాసేవ జేసి యుండిన భాగ్యశాలి.

ఆంధ్రుల భాగ్యోదయానికి లక్షలకొలది ధనమును ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు కానుకగా నొసంగి యుండిన ధర్మమూర్తి. విజయవాడ పురమందిర నిర్మాణముకు వేలను వేలు ద్రవ్యము నొసంగి యుండిన, ధన్యాత్ముడు.

శ్రీ హరినారాయణపంతులుగారి సతీరత్నమైన అన్నపూర్ణాదేవిగారినామముచే అన్నసత్రము విజయవాడ పట్నమున నేర్పరచి బీదబ్రాహ్మణులను విద్యలు జెప్పించుచుండెడి త్యాగశీలుడు. లక్షలకొలది ఖర్చుపెట్టి కట్టబడిన అన్నపూర్ణాదేవి అన్నదాన సత్రము ఆచంద్రార్కముగా విరాజిల్ల బడుటకు ప్రతి సంవత్సరము షుమారు మూడువందలు ధాన్యపు బస్తాలు ఆదాయము నచ్చు వలివర్తిపాడు గ్రామములోని 23 యకరముల మాగాని భూమిని ఆ ధర్మసంస్థపేర దఖల్ వ్రాసి ట్రస్టీలపాలన నేర్పరచిన ధార్మిక చక్రవర్తి.

శ్రీ తుమ్మలపల్లి జగన్నాధంపంతులు బి. ఏ. బి. యల్. హైకోర్టు వకీలుగారు, భూస్వామి, విజయవాడ.

శ్రీ తుమ్మలపల్లి కామేశ్వరావుపంతులుగారు గుడివాడ శ్రీ పంతులుగారు అపారమైన ఆంజనేయభక్తులు. గుడివాడ

పట్టణమునందు, వేలకు వేల ధనమును, హెచ్చించి, శ్రీ ఆంజనేయస్వామికి గుడి, గోపురంబులను నిర్మింపజేయించి శ్రీ ఆంజనేయస్వామికి, ఆదాయము వచ్చుటకు, షుమారు, లక్షరూప్యములు, విలువజేయు భవనములను, నిర్మించి, ప్రతి నెల, ఆభవనముల పైనవచ్చు వరుమానమున్నూ షుమారు, నలుబదివేలు విలువగల మాగాని భూమిని శ్రీ అంజనేయ స్వామివారిపేర వ్రాయించి కీర్తి వహించిన సద్ధర్మమూర్తి. శ్రీ కామేశ్వరరావు పంతులుగారి తనయుడైన శ్రీ తుమ్మలపల్లి కుటుంబరావు పంతులుగారు కూడ, తమ తండ్రిగారు జేయించియుండిన శ్రీ ఆంజనేయస్వామి కోవెల గోపురప్రాకార ముల పట్ల భక్తిశ్రద్ధలతో సేవజేయుచూ, పూర్వము కంటె హెచ్చు ఆదాయమున్నూ, శ్రీ ఆంజనేయస్వామివారికి లభించ జేయుచున్న అమాత్యచూడామణి, గొప్పధనవంతులు, గొప్ప భూస్వామి. శ్రీ తుమ్మలపల్లి వెంకటనారాయణ పంతులు గారు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు, భూస్వామి, విజయవాడ. వారి సోదరుడైన శ్రీ తుమ్మలపల్లి రాజగోపాలరావు పంతులుగారు బి.ఏ.బి.యల్,అడ్వకేటు,భూస్వామి,గుడివాడ శ్రీ తుమ్మలపల్లి సుబ్బారావు పంతులుగారు, విలేజి ఆఫీసరు. శ్రీ తుమ్మలపల్లి శేషాచలంగారి కుమారుడు సత్యనారాయణ పంతులుగారు భూస్వామి. వీరు గడియారములు బాగుజేయుటయందు ఘనత కెక్కిన నిపుణుండు, గుడివాడ.

శ్రీ తుమ్మలపల్లి వెంకటరత్నం పంతులుగారు కవీశ్వ రుడు. వీరి సోదరుడు శ్రీ శివరావు పంతులుగారు గుడివాడ పట్టణముకు, కరణముగా యుండి ప్రజలపట్ల న్యాయముతో మెలగుచుండిన రాజనీతి వర్యుండు.

# శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారు

వెంకట్రామ అండ్ కో., విజయవాడ. వెంకట్రామ పవరుప్రెస్, ఏలూరు.

---

శ్రీమహావిష్ణువుకు కోడలునూ బ్రహ్మకు సతీమణియై మయూరవాహనధారిణి యగు శ్రీ సరస్వతీదేవికి రత్నమయ మగు కాంతులతో విరాజిల్లు సువర్ణ మందిరంబును ఏలూరు పట్టణంబున నిర్మింపజేయించి ప్రతి నిత్యము శ్రీ సరస్వతీదేవి నేత్రములకు రంగురంగుల మిళితమైన కస్తూరికాటుకలతో తీర్చి దిద్దజేయుచు, మయూరరాజమునుగల మెరుపు కాంతులతో కన్నులు మిరుమిట్లుగొలుపు శృంగారవైభములచే ఆనందము లుట్టిపడు ముద్దులొలుకు లావణ్యములుగల ఆధునిక శాస్త్రం బులు, విజ్ఞాన సర్వస్వములు, భారతవీరుల జీవితములు, ఆర్థిక చంద్రికలు పంచమవేదమై ప్రపంచ విఖ్యాతిగాంచిన భార తాది పురాణగ్రంథరాజములు శ్రీ సరస్వతీదేవి మందిరములో నుత్పత్తి జేయించగల్గి ఆంధ్రమహాజనులకు అనుదినము అంద చేయుంచుచుండెడి ఆర్వేల అమాత్యశేఖరుడు. సంపద సౌభాగ్యములతో తులతూగుచుండిన విజ్ఞానఘనుడు.

అహోరాత్రములయందు అచంచలమైన దీక్షా వ్రత ములతో సరస్వతీదేవికి పూజలు జేయుగలుగుచూ శ్రీ సరస్వతీ దేవివల్ల వరములు బడసిన శ్రీ పురుషోత్తముడు. ఏలూరు పట్టణమునందు విద్యాశాలను, దేవాలయ ప్రతిష్ఠను జేయించి యుండిన దేవాంశ సంభూతుడు. శాంతము, అణకువ, అలం కారములు ధరించెడి శీలసంపన్నుడు. మంచుక్రింద దాగిన మార్తాండునివలె ఆంధ్రదేశమందు శ్రీ వెంకట్రావుపంతులు గారు విరాజిల్లగల్గుచుండిరి.

# శ్రీ విన్నకోట రఘుపతిదీక్షితవర్యుని వంశము

—ooঃoঃoo—

విజ్ఞానమణుల వంశమున శ్రీ విన్నకోట రఘుపతిదీక్షిత వర్యుండుదయించెను. అనుపమానీయుడు విష్ణుభక్తుడై నెల్లప్పుడు శ్రీరాముని సేవించుచుండెడి భక్తాగ్రేసరుండు.

గ్రామ కరిణీకోద్యోగమును స్వీకరించి గ్రామ పున ర్నిర్మాణము గావించగలిగిన ధీశాలుడు. గుఱ్ఱపుస్వారీలో ఐ.సి.యస్. కలెక్టర్లతో పందెములు వేసి వాయువేగములో గుఱ్ఱమును నడిపించి ఐ. సి. యస్. కలెక్టర్లను ఓడించగలిగిన ప్రతిభావంతుడు.

శ్రీ రఘుపతిదీక్షితవర్యుని ధర్మపత్నిగారైన శ్రీ సుబ్బ మాంబగారు అనుదినము అన్న దానముజేసి అనంత కీర్తిని వహించిన పుణ్యశాలి.

శ్రీ రఘుపతిదీక్షితవర్యునకు పుత్రరత్నమైన శ్రీ వెంకట సుబ్బారావుపంతులుగారు, కృష్ణామండలములోని మోటూరు పటేజి కరణముగా నేర్పడి గ్రామ ప్రజలను రంజింపజేయగల్గిన రాజనీతజ్ఞుండు. ఆయునవకశీలుని ప్రోత్సాహముచే ఆగ్రామము నందు హైస్కూలు, గ్రామ పంచాయితీబోర్డు, రహదారి నిర్మాణము, మంచినీటి తటాకాదుల వసతులు, హాస్టల్ సౌకర్యములు శాశ్వితవంతములుగా విరాజిల్ల జేయగలిగిన గ్రామాభరణము. మోటూరుగ్రామములోని శ్రీ సీతారామ స్వామి దేవాలయమును ట్రష్టీ పదవిలోనుండి శ్రీ స్వామివారి యీనాములపై వచ్చు ఆదాయమును వృద్ధిచేయించి శ్రీ స్వామివారికి భక్తి శ్రద్ధలతో మహోత్సవములు జేయించు చుండిన ధర్మమూర్తి. గ్రామప్రజలను ఏకోన్ముఖముగాజేయ

గలిగి గ్రామ భాగ్యోదయానికి గట్టిపునాదులు నిర్మింపజేయుం చిన భాగ్యశీలుడు. సస్యాభివృద్ధికి తోడ్పడి గ్రామములోని పంటలను అభివృద్ధి జేయగలిగించిన ధన్యవరుడు.

విన్నకోటవారి వంశమునందు శ్రీ విన్నకోట వెంకటేశ్వరరావుపంతులుగారు బి.ఎ., తహశీలుదారు. నందిగామ ప్రభుత్వపాలనలో వన్నెగాంచిన ప్రజ్ఞాధురీణుండు.

శ్రీ విన్నకోట సత్యనారాయణరావు పంతులుగారు, అంగలూరు కరణము, గ్రామోద్యోగి పత్రికకు ఎడిటరు, రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘమునకు శెక్రటరీ.

శ్రీ విన్నకోట వెంకటరంగారావు పంతులుగారు హైస్కూలు హెడ్‌మాష్టరు, దేశ చరిత్రలు వ్రాసిన పండితవర్యుండు.

శ్రీ విన్నకోట వెంకటసుబ్బారావు పంతులుగారు ఓరియంటల్ ఇన్స్యూరెన్సు ఏజెంటుగాయుండి వేలనువేలు ధనమును ప్రజలకు నిప్పించగలిగి ప్రజాసేవజేసిన పవిత్ర హృదయుడు. శ్రీ విన్నకోట మాధవరావుపంతులు బి.ఎ. డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్. కవిత్వములోను వ్యాసములయందును గ్రంథవిమర్శనపట్లను ప్రఖ్యాతిగాంచిన ప్రజ్ఞానిపుణుండు.

శ్రీ విన్నకోట సూర్యనారాయణపంతులుగారు గొప్ప భూస్వామి. శ్రీ విన్నకోట దుర్గావరప్రసాదరావుపంతులుగారు గొప్ప భూస్వామి.

శ్రీరాముని గోత్రము శ్రీ విన్నకోటవారి గోత్రము నొకటిగా నేర్పడి విరాజిల్ల గల్గుచుండిరి. విన్నకోట వారి గృహనామముచే విన్నకోటగ్రామము నిర్మింపబడినది.

---

# బొడ్డపాటి పేరయామాత్యుని వంశము 

కృష్ణామండలమునకు జెందిన బొడ్డపాటి గ్రామము శ్రీ పేరయామాత్యునకు జన్మస్థానము. కవిత్వమునందు ఆరితేరిన ఘనుడు. శంకరవిజయము, మరికొన్ని శతకములు రచించిన కవివర్యుండు.

బొడ్డపాటి తిరుమలరావుపంతులుగారు ఆంధ్రదేశంలో గొప్ప డాక్టరుగాయుండి ప్రఖ్యాతినహించిన ఆర్వేలఅమాత్య శిరోమణి, విశాఖపట్టణము.

బొడ్డపాటి పూర్ణచంద్రరావుపంతులు, బి.ఎ.బి.యల్. వకీలుగారు. షోడశ కళా తేజోవంతుడైన పూర్ణిమనాటి పూర్ణచంద్రుడు ఎంత నాహ్లాదకరము ప్రజలను గొల్పు చున్నాడో అట్లే శ్రీ పూర్ణచంద్రరావుపంతులుగారు న్యాయ వాదిగాయుండి, జనులను అట్లు ఆనందము నొసంగుచుండిన శాంతమూర్తి. గుడివాడ.

శ్రీ బొడ్డపాటి వాసుదేవమూర్తిపంతులుగారు ఎల్.ఎమ్.పి. డాక్టరుగారు ప్రజారంజకముగ ప్రజాసేవజేయుధార్మికవర్యుండు

శ్రీ బొడ్డపాటి రఘునాథరావుపంతులుగారు, ప్రఖ్యాతి గాంచిన ఆర్వేల అమాత్యశేఖరుడు. భూస్వామి.

శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు పంతులుగారు, గ్రామోద్ధరణ పత్రికను స్థాపించి ప్రజాసేవజేసిన అమాత్య మణి. విలేజి ఆఫీసర్ల తనయులను, మరికొందరు యువకులను గ్రామోద్యోగియ కళాశాలను నిర్మించి వేలకువేలు ప్రజలను గ్రామోద్యోగియ పరీక్షలలో నుత్తీర్ణులను జేయించియుండి, ఆంధ్రదేశములో వన్నెగాంచిన ప్రజ్ఞాసమన్వితుండు.

శ్రీ

# శ్రీ దిట్టకవి నారాయణామాత్యుని వంశము

ఈ కవివరేణ్యుండు రంగరాయచరిత్ర రచించిన గ్రంథకర్త. దిట్టకవి శ్రీరాములుగారితనయుండైన శ్రీరామకృష్ణయ్య పంతులు, బి.ఎ.బియ.ల్. అడ్వొకేటు. యీ కవిశ్రేష్ఠుండు మనోహరములైన పద్యశతకములు రచింపజేసిన భక్తాగ్రేసరుండు సంగీతమునందు పన్నెగాంచిన గానకోకిల. గుడివాడ.

శ్రీ దిట్టకవి సత్యనారాయణపంతులు బి.ఏ. వకీలుగారు క్రిమినల్ కేసుల వ్యవహారములలో గొప్ప నేర్పరితనముగన్న మహామేధానిధి. శ్రీ దిట్టకవి రామకృష్ణయ్య బి.ఎ. వకీలుగారు, కొన్ని గ్రంథములను రచించి ప్రజాసేవజేసిన ప్రజ్ఞానిరుడు.

దిట్టకవి వెంకటసుబ్బారాయుడుగారి కుమారుడు శ్రీ రాఘురావుపంతులుగారు, బి.ఏ. జ్యోతిష్యమునందు ప్రజ్ఞగాంచిన పండితవర్యుండు, విజయవాడ.

శ్రీ దిట్టకవి పూర్ణచంద్రరావు పంతులుగారు బి.ఏ, స్కూలు పుస్తకములు రచించిన భాషాకోవిదుడు.

శ్రీ దిట్టకవి సాంబశివరావుపంతులుగారు బి.ఏ. ప్రభుత్వయుద్యోగము జేయుచుండిన సాధుశీలుండు.

దిట్టకవి వెంకటతిరుమలరావుపంతులుగారు హరికథలు జెప్పుటయందు ఘనతకెక్కిన ఆర్వేల అమాత్యశేఖరుడు. ప్రభుత్వ యుద్యోగి.

దిట్టకవి వెంకటరత్నముగారి కుమారుడు శ్రీ రామచంద్రరావుపంతులుగారు హిందీభాషలో ప్రజ్ఞానిధి.

దిట్టకవి పట్టాభిరామయ్యగారి తనయుడు శ్రీ దశరథరామయ్యపంతులుగారు ప్రభుత్వ యుద్యోగి.

# శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు

యం. యల్. ఏ., బారిష్టరు, గుంటూరు.

ఆర్వేల అమాత్యశేఖరుల వంశమునం దుదయించిన అవతారపురుషుడు. గుంటూరుపట్టణ పురపాలకసంఘమునకు శ్రీ వెంకటలక్ష్మీనరసింహారావు పంతులుగారు చైర్మన్‌పదవి స్వీకరించి, నేత్రోత్సవముగొల్పు వైభవోన్నతి గుంటూరుపట్టణమును లభింపజేసిన పరాక్రమశాలి. ఆంధ్రదేశమునకు మధ్యను ఆంధ్ర హైకోర్టు గుంటూరుపట్టణమునందు నిర్మింపజేయించ గలిగి, ఆంధ్రప్రజలకు, సౌకర్యము లొనగూర్చిన ధీశాలి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తునందును, ఆంధ్ర శాసనసభలోను సభ్యత్వముగైకొన్న ప్రజాసంపన్నుడు. రాజ్యాంగ వ్యవహారములలో గౌరవ సత్కృతులనందిన నాయకాగ్రణి. విద్యాసంపదలలో ప్రావీణ్యమునాంచిన సచివోత్తముడు. న్యాయస్థానములలో శ్రీ పంతులుగారు మేధాశక్తిని వినియోగించి, ప్రజలకు న్యాయము జేయించగలిగిన విద్వన్మహారత్నము. ప్రజాదరణ చూరగొన్న ప్రజాబాంధవుడు. జనసమూహము లను ఏకోన్ముఖముగా జేయగలిగిన మహారథుడు. దశావతారములలోని శ్రీరామునిగోత్రమునే శ్రీ పంతులుగారు ధరించి శ్రీ కృష్ణజన్మస్థానమునకు నేగి, గుంటూరుసీమనుండి బ్రిటను ప్రభుత్వమును వారిమాతృభూమికి క్షేమంగా జేర్పించుటయందు దక్షతవహించిన శ్రీ నరసింహావతారుండు.

శ్రీ నడింపల్లి సీతారామయ్యపంతులుగారు న్యాయవాదిగాయుండి, సత్కీర్తిగాంచిన పుణ్యశాలి.

శ్రీ నడింపల్లి దశరథరామయ్యపంతులుగారు గొప్పబారిష్టరుగా నేర్పడి, సంపత్ భాగ్యములచే విరాజిల్లు అమాత్యమణి.

83

# శ్రీ దేశరాజు హనుమంతరావుపంతులుగారు

ఆంధ్ర హైకోర్టు అడ్వొకేటు, గుంటూరు.

---

దేశప్రజలకు సౌభాగ్యములు జేకూర్చి దేశరాజుయని యశోవైభవముగన్న అమాత్యశేఖరుల వంశమున శ్రీ హనుమంతరావు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు న్యాయవాదులైయుండి గౌరవప్రతిష్ఠలుఆర్జించుకొన్న దేవాంశసంభూతుడు. గుంటూరు పట్టణమునందుగల హిందూకాలేజీకి శ్రీ పంతులుగారు అధ్యక్షపీఠము స్వీకరించి హిందూకాలేజీని ఉన్నతస్థితికిదెచ్చిన విజ్ఞానమణి. శ్రీకృష్ణావతారుడైయుండిన శ్రీరాముని దర్శించుటకొరకు శ్రీ హనుమంతరావు పంతులు గారు శ్రీకృష్ణ జన్మస్థానము గాంచివచ్చిన శ్రీరామ భక్తాగ్రేసరుండు. శ్రీ ఆంజనేయునిగోత్రనామము, శ్రీ హనుమంతరావుపంతులుగారి గోత్రనామము నొకటిగా నేర్పడి ఉభయులు ఏకనామ సగోత్రీలుయుగా విరాజిల్లగల్గుచుండిరి. శ్రీ దేశరాజు కృష్ణయ్య పంతులుగారు సెటిల్‌మెంటు ఆఫీసరు, బాపట్ల. శ్రీ దేశరాజు సార్వభౌమరావు పంతులుగారు బి.ఎ.,బి.ఎల్., అడ్వొకేటు, బాపట్ల. శ్రీ దేశరాజు సీతారామారావుపంతులు గారు మైసూరు మహారాజ సంస్థానములో ఉన్నతఉద్యోగి. శ్రీ దేశరాజు నరసింహారావు పంతులుగారు మైసూరు రైల్వే ఇంజనీయరు.

---

# శ్రీ మానికొండ సత్యనారాయణపంతులుగారు ౬౨

బి. ఏ., బి. యల్., అడ్వకేటు. కృష్ణా మండలము.

---

అనంత మాణిక్యములచే విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ మానికొండ సత్యనారాయణ పంతులుగారు జన్మించిరి. భాగవత గ్రంథకర్త శ్రీ పోతనామాత్యుండును, రామాయణ గ్రంథకర్త శ్రీ సత్యనారాయణ పంతులుగారును సగోత్రీయులైనందున శ్రీ పోతనామాత్యునివలెనే శ్రీ సత్యనారాయణపంతులుగారుకూడ కర్షకవృత్తినేగైకొన్న అమాత్య రత్నము. శ్రీ పంతులుగారు పెక్కుసార్లు శ్రీకృష్ణజన్మస్థానము సందర్శించి శ్రీకృష్ణపరమాత్ముని ఆశీర్వాదములు బడయ గలిగిన శ్రీరామ భక్తాగ్రేసరుడు. కవిత్వమునందు పేరెన్నిక గన్న కవిశిరోమణి. న్యాయవాదియైయుండి యశోధనము నార్జించుకొన్న న్యాయశాస్త్ర కోవిదుడు. బీదసాదలను ఆదరించెడి పుణ్యశాలి. బహుభాషలయందు కవిత్వముజెప్పెడి భాషాకోవిదుడు. దేశసేవకై సర్వస్వము త్యాగమొనర్చిన త్యాగధనుడు. విజ్ఞానసంపదచేవిరాజిల్లు అమాత్యచూడామణి. శ్రీ పంతులుగారి నామోచ్చరణచేత మనంబు నాహ్లాదకరంబు జనించును. శ్రీ సత్యనారాయణ పంతులుగారి గృహనామముచే మానికొండ గ్రామము విరాజిల్ల గలుగుచున్నది.

---

# శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి పంతులు

ఎమ్. ఎ., బి. యల్., ప్రధాన ఆంగ్లాధ్యాపకుడు,
ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి ఆర్. కళాశాల, విజయవాడ.

సంపద సౌభాగ్యములచే విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి పంతులు గారు జన్మించిరి. ఆమహారథుడు నాలుగైదుభాషల విద్యలలో వన్నెగాంచిన పండితరత్నము. ఆమేధానిధి శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధిగాంచి విజ్ఞాన తేజోవంతములైన పెక్కు గ్రంథ రాజములను, ముద్రింపజేయించి, ఎం. ఏ., బి. ఏ., ఆనర్సు బి. ఎ., ఇంటర్ క్లాసుల పాఠ్య గ్రంథములుగా ప్రభుత్వము వారిచేత నేర్పరచజేసియుండిన అమాత్యచూడామణి. ఆసియా మహాసభ, ఆల్ ఇండియా ఓరియంటల్, ఆల్ ఇండియా లైబ్రరీ మున్నగు మహాసభలయందు శ్రీ పంతులుగారి ఉప న్యాస ప్రతిభా విశేషములచే సభికులను తన్మయులుగా జేసి యుండిన అమాత్యశిరోమణి. విశ్వకళాపరిషత్తుయందు పరీక్షాధి కారియై విరాజిల్లు విద్వన్మహనీయుడు. ప్రపంచ రచయితల సంఘమునందును, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డ్ ఎఫైర్సు లోను సభ్యత్వమును గైకొన్న ధీరచారిత్రుడు. భారతదేశ విద్వాంసులలో మహోన్నతస్థానము అలంకరించిన కీర్తి చంద్రుడు. శ్రీ సరస్వతీదేవి నిప్రసన్నముగన్న భక్తిసంపన్నుడు ద్వాదశాదిత్యుడని సూర్యుడెట్లు పేర్గాంచియుండెనో అట్లే శ్రీ సత్యనారాయణమూర్తి పంతులుగారుకూడ సాహిత్య భూషణ, ఉపన్యాసకేసరి, అమృతవాక్య శిరోమణి, వేదాంత విశారద, ఉపన్యాస సార్వభౌమ మొదలగు ద్వాదశాది బిరు దములు వహింపగలిగిన దేవాంశ సంభూతుడు.

# శ్రీ ప్రభాకర ఉమామహేశ్వరపండితవర్యులు

విజయవాడ.

జగద్విఖ్యాతిగాంచిన ఆర్వేల అమాత్యశేఖరుల వంశము నందు శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితమహాశయుడు జన్మించెను. ఆ పండితశ్రేష్ఠుండు, హిందూమతము, హిందూ సిద్ధాంతములనుగూర్చి విశాలాంధ్రదేశమునందు గొప్పప్రచార మొనర్చియుండి, హిందూమతవిచ్ఛిన్నశక్తులకు విజ్ఞాననేత్రంబు లను విప్పారజేసియుండిన పండితశిరోమణి. ప్రతిపట్టణమందును ప్రతి పల్లెలలోను హిందూమతముయొక్క ఔన్నత్యాదివిశేష ములను వెల్లివిరియునట్లు ఉపన్యాసములొసంగి, హిందూమత మునుండి అన్యమతమును స్వీకరించినప్రజలను వారి మాతృ దేశపుమతమైన హిందూమతమునందుజేర్చిన పండిత హిందూ ప్రచారకేసరి. హిందూ ప్రజలను ఏకోన్ముఖముగ నొనరించి, హిందూమతభాగ్యమును దేశదేశములయందు వెదజల్లిన ఆంధ్ర వివేకానందుడు. హిందూమత గ్రంథములు ఉక్కు కాంక్రీటు పునాదులుగొల్పు ప్రతిభావంతములుగా రచించిన హిందూ మతోద్ధారకుండు. విశాలాంధ్రదేశమునందు విఖ్యాతివహించిన హిందూప్రచారక సార్వభౌముడు.

---

# శ్రీ గుడ్లవల్లేటి చలపతిరావుపంతులుగారు

బి. ఏ. బి. యల్., తహశ్శీల్దారు. (కృష్ణా)

---

సాహసాది సద్గుణ యశోవైభవములచే విరాజిల్లు అమాత్య శేఖరుల వంశమున, శ్రీ పంతులుగా రుద్భవించగలిగిరి. శ్రీ పంతులుగారు తమ చిరుతప్రాయమునందే ఆంగ్లవిద్యలో పట్ట భద్రుడై న్యాయవాదిపరీక్షలో ఉత్తీర్ణుడైన ప్రతిభాశీలుడు. శ్రీ పంతులుగారి యపారమేధాశక్తికి ఆంగ్లకలెక్టర్లు అచ్చెరువొంది రెవెన్యూడిపార్టుమెంటునందొక ఉద్యోగము శ్రీ పంతులుగారికి యొసంగియుండిరి. శ్రీ పంతులుగారు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధిగాంచి తాలూకా తహశ్శీల్దారు పదవి గైకొనగలిగిరి. శ్రీ పంతులుగారు తహశ్శీల్దారు ఉద్యోగము స్వీకరించి, ప్రభుత్వమునెడలను, ప్రజలపట్లను తమ ధర్మములను సక్రమముగా నిర్వహించుచూ ప్రభుత్వమువారి ఆదరాభిమానములు బడయగలిగిన అమాత్యరత్నము. శ్రీ పంతులుగారి విశిష్టగుణవిశేషమే ప్రజా హృదయాన్ని ఆకర్షించి గౌరవ ప్రతిష్ఠగాంచియుండిన ప్రతిభాశాలి. శ్రీరాముని గోత్రము శ్రీ చలపతిరావు పంతులుగారి గోత్రము నొకటిగా నేర్పడి యుండుటచేతనే ప్రభుత్వ పాలనయందు ప్రఖ్యాతితో శ్రీ పంతులుగారు విరాజిల్లగల్గుచుండిరి. గుడ్లవల్లేరు గ్రామము శ్రీ చలపతిరావుపంతులుగారి వంశమువారిచే నిర్మింపబడినది. శ్రీ గుడ్లవల్లేటి లక్ష్మణరావు పంతులుగారు, యం. బి., బి. యస్. డాక్టరు. ఆరోగ్యహీనులైనప్రజలను ఆరోగ్యవంతులుగా జేయుటకొరకు లక్ష్మణ నామముతో వెలసిన శ్రీరాముని సోదరుండు.

# శ్రీ యల్లంరాజు పేరయామాత్యుని వంశము

## తమిరిశ (కృష్ణా మండలము)

యశశ్చంద్రికలచే విరాజిల్లు అమాత్య శేఖరులవంశమున శ్రీ యల్లంరాజు పేరయామాత్యుడుదయించెను. శ్రీరాముని గోత్రము శ్రీ పేరయామాత్యుని గోత్రము నొకటిగా నేర్పడి ఉభయులు సగోత్రీయులైయుండిరి. శ్రీ పేరయామాత్యునకు శ్రీ శాస్తుర్లు పంతులు అను తనయుండుగలడు. శ్రీ శాస్త్రుల్లు పంతులుగారు తమిరిశ గ్రామకరణముగాయుండి వందలతరబడి యకరముల భూమిని దేవబ్రాహ్మణ మాన్యములక్రింద జేర్పించి యుండిన పుణ్యశాలి. శ్రీ శాస్తుర్లుపంతులుగారికి శ్రీ సూరయ్య పంతులుగారు, శ్రీ వెంకటాచలం పంతులుగారు, శ్రీ పేరయ్య పంతులుగారు, శ్రీ శేషయ్య పంతులుగారు, శ్రీ గురునాథము పంతులుగారను ఐదుగురు పుత్రరత్నములు గలరు. వారిలో ప్రథమ పుత్రుండైన శ్రీ సూరయ్య పంతులుగారు తమిరిశ గ్రామకరణమైయుండి భూములులేని ప్రజలకు భూములను, గృహములులేని జనులకు గృహములను నిర్మింపజేయించి అన్నదానము జేయించియుండిన పవిత్రమూర్తి. నాలుగైదు వేలు ధాన్యపు బస్తాలు ధాన్యమును పండించ గలిగిన గొప్ప భూస్వామి. శ్రీ సూరయ్య పంతులుగారు శ్వేత అశ్వమును అధిరోహించి ప్రయాణముజేయు ప్రతిభాశాలి. శ్రీ వెంకటాచలం పంతులుగారు వ్యవసాయ కార్యక్రమములను కడు నేర్పుగాజేయించెడి మహారథుడు. శ్రీ పేరయ్యపంతులుగారు కర్షకవృత్తితోగూడి కల్లాకపటమునెరుంగని సాధుజనశీలుండు. శ్రీ శేషయ్యపంతులుగారు వ్యవసాయపుఆదాయములు లెక్క-

ప్రాయ అమాత్యశేఖరుడు. శ్రీ గురునాథము పంతులుగారు అభము శుభము నెరుంగని అమాయకరత్నము.

శ్రీ యల్లంరాజు సూరయ్యాపంతులుగారు గొప్ప కంట్రాక్టరుగాయుండి కృష్ణాజిల్లాలో ప్రప్రథమముగా పెద్ద పెద్ద పంటకాల్వలను, మురుగుకాల్వలను త్రవ్వించి, జిల్లా ప్రజలచేత గౌరవప్రతిష్ఠలు గాంచియుండిన అమాత్యశిరోమణి. శ్రీ సూరయ్యాపంతులుగారి పెదతనయుండైన శ్రీ యల్లంరాజు హరినారాయణపంతులుగారు, యింజనీయరు యుద్యోగము స్వీకరించి విజయవాడ కృష్ణానకట్టపై ఆనడుగులతలుపులను నేర్పరచజేయించిన అసమానప్రజ్ఞాధురీణుండు. గొప్పభూస్వామి గుడివాడ. శ్రీ సూరయ్యాపంతులుగారి ఆరవతనయుండు శ్రీ యల్లంరాజు ఉమామహేశ్వరరావుపంతులు ఓవర్సీయర్ శ్రీ యల్లంరాజు సూర్యయ్యపంతులుగారిసోదరుండైన శ్రీ శేషయ్య పంతులుగారి కుమాళ్లు శ్రీ యల్లంరాజు సుబ్బారావుపంతులు ఓవర్శీయర్గారు, శ్రీ యల్లంరాజు కృష్ణయ్యపంతులు ఓవర్శీయరుగారు పంటకాల్వలకు చాలినంత నీటిసప్లయిజేయించి కృష్ణాజిల్లా ప్రజలఅభినందనములు బడయగలిగిన అమాత్య రత్నములు. శ్రీ సూరయ్యపంతులుగారి తనయులు శ్రీ యల్లంరాజు వెంకటసుబ్బారావుపంతులు బి. ఏ., న్యాయవాదిగా యుండి కీర్తిప్రతిష్ఠలచేవిరాజిల్లిన గొప్పప్రతిభాశాలి. తెనాలి.

శ్రీ యల్లంరాజు రామారావుపంతులుగారు సివిల్కోర్టు యుద్యోగమువహించిన సుగుణమూర్తి. విజయవాడ. శ్రీ యల్లంరాజు శాస్త్రుల్లపంతులు బి.ఏ., బి. యల్., హైకోర్టు

న్యాయవాది. అన్నదానము జేయించెడి తాగధనుండు. సౌందర్యమునొప్పు సువర్ణవిగ్రహము. విజయవాడ.

శ్రీ యల్లంరాజు సూర్యనారాయణపంతులు, బి.ఏ., బి.యల్., ప్రఖ్యాతిగాంచిన ఆంధ్రహైకోర్టు న్యాయవాది. తెనాలి. శ్రీ యల్లంరాజు గోపాలకృష్ణమూర్తిపంతులు, ఆంధ్ర హైకోర్టు, సుప్రీమ్‌కోర్టులఅడ్వకేటు. ఆర్వేలఅమాత్యశేఖరుల వంశములో యువకరత్నము. గుంటూరు.

శ్రీ యల్లంరాజు పేరయ్యపంతులుగారి తనయుండైన శ్రీ యల్లంరాజు విజయరామయ్యగారు, రైతుపన్నులగురించి పత్రికలలో పెక్కువ్యాసములు ముద్రింపజేయించికలిగి, రైతు మోయు సుంకములు అను నామముతో 1937 వత్సరమున గ్రంథము రచింపజేయించి, శాసనసభలో రైతుకు అనుకూల మైన వడ్డీరేటు నిర్ణయచట్టము, పంటనష్టములు రిమీషు, చట్టము, యిరిగేషన్ చట్టము, రిమోడలింగు తూములు మొదలగు చట్టములు జేయించిన ప్రజాసేవకుడు. తమిరిశ, దొండపాడు గ్రామములలోని గ్రంథాలయములకు ప్రధానపోషకవర్గసభ్యుడు. తమిరిశ గ్రామములో తటాకము నిర్మింపజేయించిన ప్రజాబాంధవుడు. ఆర్వేలఅమాత్యశేఖరుల గ్రంథనిర్మాత.

శ్రీ యల్లంరాజు సూర్యనారాణపంతులుగారు ప్రఖ్యాతిగాంచిన గొప్పడాక్టరు సంపదసౌభాగ్యములచే విరాజిల్లు అమాత్యరత్నము.

శ్రీ యల్లంరాజు వెంకటరత్నంగారి తనయుండైన నరసింహ్వాంపంతులుగారు, తమ సర్వస్వము త్యాగమొనరించి గుడివాటపట్టణమున శ్రీగౌరీశంకరఆలయము నిర్మింపజేయించి, ఎనిమిది యకరముల యీనాముభూమిని దేవునిపేరను దఖలు వ్రాసి ప్రతిష్ఠాపాలన నేర్పరచిన ధన్యమూర్తి. శ్రీ గౌరీశంకర దేవునిపేర గుడివాడ పట్టణమున గౌరీశంకరపురమను నామముతో నొకపేట నిర్మింపబడినది.

శ్రీ యల్లంరాజు సుదర్శనరావుపంతులుగారు, గుడివాడ పురపాలకసంఘ సభ్యులు. శ్రీ పంతులుగారి నామవిశేషమే పంతులుగారి సాహసాదిగుణములను జెప్పకయే జెప్పుచున్నవి.

శ్రీ యల్లంరాజు వెంకటనారాయణ పంతులుగారు వ్యాపారముజేయు అమాత్యశేఖరుడు.

శ్రీ యల్లంరాజు వెంకటకాశీవిశ్వేశ్వరరావుపంతులు గారు వర్తకవ్యవహారములు, వ్యవసాయము జేయు ధీశాలి. గుడివాడ.

చంద్రునివిడనాడి చంద్రికయుండనట్లు శ్రీ యల్లంరాజు సూరయ్య పంతులుగారు స్వర్గమునకు నరుదెంచిననాటి రేయినే శ్రీ సూరయ్యపంతులుగారి సతీరత్నము శ్రీ దుర్గాంబదేవిగారు తమిరిశ తటాక జలమునలీనమై వైతరుణీనదీ జలమున తేలి భర్తయగు శ్రీ సూరయ్య పంతులుగారిని స్వర్గమందిరమున చేరగలిగెను.

---

# శ్రీ అడవికొలను సాంబసివరావుపంతులుగారు

సబ్ జడ్జి, గుడివాడ.

అష్టదిగ్గజములై విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ అడవికొలను సాంబశివరావు పంతులుగారుదయించిరి. శ్రీ పంతులుగారు బాల్యమునందే ఆంగ్లవిద్యలో ఘనతికెక్కిన ప్రజ్ఞాధురంధరుడు. శ్రీ దశరథుని ఆజ్ఞను శ్రీరాముడు అడుగు దాటక ఎట్లు ప్రవర్తించగలిగెనో అట్లుగానే శ్రీ పంతులుగారు గూడ తమ జనకుని మాటను జవదాటి ఎరుంగని పితృవాక్య పాలకుడు. శ్రీ పంతులుగారు న్యాయవాది పరీక్షలో ప్రతిభ గాంచి న్యాయమూర్తి పీఠముగైకొన్న దేవాంశసంభూతుడు. సూర్యకాంతిచే చీకటి ఎట్లు పటాపంచలగుచుండెనో అట్లే త్రిలోచనుండైన శ్రీ పంతులుగారి యెదుట దుష్ట చారిత్రులు దూరమగుచున్నవి. క్రూరచిత్తుల ఎత్తులు నిరర్థకములై నిష్ఫలములు గాంచుచున్నవి. శ్రీ పంతులుగారు న్యాయపాలన యందు దక్షతవహించి మహాతేజోవంతముతో ప్రజాసముఖముకు న్యాయము జేకూర్చుచుండిన పురహరుండు. సత్యమునే పాలించుచుండెడి సత్యచారిత్రుడు. యశశ్చంద్రికలచే విరాజిల్లు అమాత్యరత్నము. చీమదూరని చిట్టడివియందును, కాకిదూరని కారడవులలోను కొలనులు త్రవ్వించగల్గుటచే అడవికొలను అను గృహనామము శ్రీ పంతులుగారి వంశము పట్ల నేర్పడ గల్గినది.

# శ్రీ కాకాని నరసింహారావు పంతులుగారు

కవివరేణ్యుండు.

---

దేశప్రజలకు కల్పతరువై విరాజిల్లెడి అమాత్యశేఖరుల వంశమున శ్రీ కాకాని నరసింహారావుపంతులుగా రుదయించ గల్గిరి. శ్రీ పంతులుగారు రెవెన్యూ డిపార్టుమెంటునందొక యున్నతఉద్యోగము స్వీకరించి ప్రభుత్వమువారిచేతను, ప్రజల చేతను గౌరవప్రతిష్ఠలు గాంచియుండిన ప్రజ్ఞాధనుండు. విజ్ఞాన మణులచే గ్రంథరాజములనునిర్మించి ప్రజలకుమహోపకారము లొనర్చగల్గిన విద్వన్మహామహుడు. నవయౌవనోత్సాహభరితుండై బ్రహ్మవర్చస్సుతోఁగూడిన శ్రీ పంతులుగారియొక్క పలుకుల లావణ్యము, మనోహరములనుగొల్పు వారి కవితానిపుణత్వము గాంచిన ప్రజాహృదయమందు యానందకరము జనించుచుండును. శ్రీ పంతులుగారు చిరుతప్రాయముననే తమ యపారమేధాశక్తిని ప్రదర్శించి కవిచంద్రుడుగా పేర్గాంచి యుండెను. భారతవీరుల సచ్చారిత్రలు, భారతరమణుల పుణ్యగాథలు రచించి బాలవిద్యార్థులకు సువర్ణకంఠాభరణములుగా జేయగల్గిన అమాత్యరత్నము. ఆంధ్రకవితా సాహిత్య సామ్రాజ్యమని పేరెన్నికగన్న గానకోకిల. శ్రీ కాకాని వంశమున కవిభాగ్యమునుగన్న పావనచారిత్రుడు. సిరిసంపదలచేదులదూగుచున్న శ్రీ నరసింహావతారుండు.

శ్రీ కాకాని హరిశ్చంద్రుడు పంతులుగారు రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగము నిర్వహించి తమ నామమునకు కళంకము రానివ్వకుండా సార్థకమొనర్చగల్గినసత్యచారిత్రుడు.

# శ్రీ బసవరాజు సూర్యనారాయణపంతులుగారు
## డిప్యూటీ కలెక్టరు.

---

బహుదేశములను కీర్తిప్రతిష్ఠలచేబరిపాలించిన అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ బసవరాజు సూర్యనారాయణ పంతులుగారుదయించగల్గిరి. శ్రీ పంతులుగారు ప్రభుత్వ ఉద్యోగముగైకొనగలిగి, సర్వశోభాయమానముతో ప్రజలను ఆనందింపజేసినఅమాత్యరత్నము. శ్రీ పంతులుగారినిర్విరామ కృషిచే ప్రభుత్వమువారి మన్ననలను బడయగలిగిన ధీశాలి.

శ్రీ బసవరాజు రామచంద్రరావుపంతులుగారు డిప్యూటీతహశీలుదారుగాయుండి, ప్రజాసేవజేసిన సచ్ఛీలురు.

శ్రీ బసవరాజు అప్పారావుపంతులుగారు, బి.ఏ., బి.యల్., న్యాయవాదిగాయుండి యశోధనముఆర్జించుకొన్న న్యాయశాస్త్రకోవిదుడు. ఆధునిక కవివర్యుండు.

శ్రీ బసవరాజు రంగశాయిపంతులుగారు, దేశసేవా దురంధరుడు. మల్లవిద్యలోను, క్రీడారంగముయందును ఆరితేరిన ప్రజ్ఞాఘనుడు. శ్రీ బసవరాజు వెంకటసుబ్బారావు పంతులుగారు, బి.ఏ., బి.ఇ.డి., స్కూళ్ళ అధికారి. మల్లవిద్యలోను క్రీడారంగమందును, నాటకరంగమందును ఘనుతికెక్కిన అమాత్య శిరోమణి.

శ్రీ బసవరాజు వెంకటసూర్యప్రకాశరావుపంతులుగారు బ్యాంకిసూపర్‌వైజరుగారుగాయుండి బ్యాంకి వ్యవహారములను కడునేర్పుతోవ్యవహరించి పేరెన్నికగన్న మల్లవిద్యా విశారదుడు. క్రీడారంగమునందు ప్రఖ్యాతిగాంచిన అమాత్య శిరోమణి.సంపద సౌభాగ్యములచేవిరాజిల్లు సాధజనశీలుండు.

---

# శ్రీ తాడినాడ వెంకయ్యపంతులుగారి వంశము

తారాపథమున తారకేశ్వరుడై విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ తాడినాడ వెంకయ్య పంతులుగారుద్భవించిరి. శ్రీ పంతులుగారు చెన్ననగరు ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రాధ్యాపకులుగానుండి తెలుగు వ్యాకరణమును రచించియుండిన పండితరత్నము. శ్రీ తాడినాడ సుబ్రహ్మణ్యం పంతులుగారు ఇన్‌కంటాక్సు ఆఫీసరుగా పనిజేసి ప్రభుత్వమువారిచేతను, ప్రజలచేతను గౌరవ ప్రతిష్ఠలుగాంచిన ప్రజ్ఞాశీలుండు. శ్రీ తాడినాడ శేషయ్యపంతులుగారు సివిల్‌కోర్టులో ఉన్నత యుద్యోగము గైకొనగలిగి ప్రభుత్వమువారివల్ల ఆదరాభిమానములు వహించియుండిన పుణ్యశాలి. కల్లాకపటము నెరుంగని సాధుజన సంపన్నుడు. గుడివాడ. శ్రీ తాడినాడ రాజగోపాలరావు పంతులుగారు గొప్ప భూస్వామి. రైల్వే యుద్యోగములోయుండి బీదసాదలకు అన్నదానము జేయుచుండిన పవిత్రమూర్తి. శ్రీ తాడినాడ రామమోహనరావు పంతులుగారు బి. ఏ., బి. యల్., అడ్వకేటు. శ్రీ పంతులుగారు హైదరాబాదు సంస్థానమునందు గద్వాల, మరిపెనుక-సంస్థానాధీశ్వరులయొద్ద గౌరవోద్యోగములు బడయగలిగి, హైదరాబాదు స్టేటు కాంగ్రెసు ఉద్యమములో పాల్గొని దేశసేవజేసిన అమాత్య శిరోమణి. గుడివాడ. శ్రీ పంతులుగారి గృహనామముచే తాడినాడగ్రామము విరాజిల్ల గల్గుచున్నది.

95

# శ్రీ తమిరిశ వెంకటరామచంద్ర అప్పారావుగారు

బి. ఏ., బి, యల్., అడ్వకేటు. నరసాపురం.

---

మహాతపోధనులై యసమాన సత్కీర్తిగాంచిన అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ తమిరిశ వెంకట రామచంద్ర అప్పారావుపంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు బాల్యమునందే ఆంగ్లవిద్యలో ప్రతిభగాంచి న్యాయశాస్త్రపరీక్షలో వన్నెకెక్కి కడునేర్పుతో ప్రజలకు న్యాయముజేయించగలుగుచుండిన అమాత్యరత్నము. నరసాపురం. శ్రీ తమిరిశ శంకర సూర్యనారాయణ అప్పారావు పంతులుగారు, బి.ఏ., బి.యల్ వకీలు. శ్రీ పంతులుగారు సివిల్ దావాలలో క్రిమినల్ వ్యవహారములలో ప్రజలకు న్యాయము జేయించుటయందు ప్రజ్ఞ గాంచిన అమాత్యచూడామణి. శ్రీ తమిరిశ లక్ష్మీనరసింహ అప్పారావుపంతులుగారు, బి. ఏ. వకీలు. శ్రీ పంతులుగారు న్యాయస్థానములయందు తమ యసమాన మేధాశక్తిచే జన సముదాయమునకు సత్యముజేకూర్చి సత్యసంధుడని పేర్గాంచిన అమాత్యశేఖరుండు. దాన ధర్మములుజేయు ధర్మమూర్తి. శ్రీ తమిరిశ వెంకటాచలపతి పంతులుగారు, యం. యస్‌సి., కాలేజీలెక్చరర్, అనంతపురం. శ్రీ పంతులుగారు ఆంగ్లభాషలో ప్రఖ్యాతిగన్న అమాత్యశిరోమణి. విద్యార్థులకు కడునేర్పుతో విజ్ఞానము నొసంగుచుండిన పావన చారిత్రుడు. శ్రీ తమిరిశ వెంకటనాగేంద్ర నీలాద్రి అప్పారావు పంతులుగారు, యం. యస్‌సి., జీయాలజిష్టు, నాగపూరు. సూదంటురాయి ఇనుము పట్ల ఎట్లుఆకర్షణశక్తి వహించుచున్నదో అట్లే భూగర్భశాస్త్ర పరిశోధనయందు శ్రీ పంతులుగారు భూమిలోపల ఖనిజ ప్రవీణతవహించిన యువకరత్నము.

# శ్రీ జయంతి కాకుళయ్య పంతులుగారు

తహశీలుదారు, నందిగామ.

దేశములనుజయించిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ జయంతి కాకుళయ్యపంతులుగారుజన్మించిరి. శ్రీ పంతులు గారు తహశీల్‌దారు ఉద్యోగమునువహించి, అసమాన కీర్తి ప్రతిష్ఠలుగాంచిన జయశాలి. దైవభక్తి పరంపరలచే శ్రీ నర సింహస్వామి ఆలయమును వేదాద్రిలో శ్రీ పంతులుగారు ప్రతిష్ఠజేయించి, స్వామివారికి యీనాములుయొసంగియుండిన ధర్మమూర్తి. బ్రాహ్మణులకు అనుదినముఅన్నసమారాధనలు జేయించెడిపుణ్యశాలి. జ్యోతిష్యము, సంస్కృతమునందు పేరెన్నికగన్న పండితవర్యుండు. డాక్టరలకు వశముగాని మాన వులరోగములను మంత్రశక్తిచేనివారించగలిగెడి మంత్రశాస్త్ర ధీసంపన్నుడు. దేవతాప్రసన్నముగన్న దేవాంశసంభూతుడు. బీదసాదలను పోషించుచుండెడి దీనజనబాంధవుండు.

శ్రీ జయంతి లక్ష్మీనరసింహ్వాంపంతులుగారు గొప్ప భూస్వామి. అన్నదానముజేయు పవిత్రమూర్తి.

శ్రీ జయంతి యోగానందనరసింహ్వాం పంతులుగారు గొప్పరైతు. దానధర్మములు యొసంగెడి ధన్యజీవితవర్యుడు.

భాగవత గ్రంథకర్త శ్రీ పోతనామాత్యుడు, శ్రీ జయంతి కాకుళయ్య పంతులుగారు సగోత్రీయులై యుండుటచేత శ్రీ పోతనామాత్యునివలెనే శ్రీ జయంతివారి కుటుంబముగూడ కర్షకవృత్తినే ఆచరించిన పవిత్రహృదయులు. హైదరాబాదు ప్రభుత్వమునందు గొప్ప ఉద్యోగములను జయంతివారి కుటుం బము స్వీకరించి, అమితమైన గౌరవప్రతిష్ఠలచే తులదూగు చున్న ఆర్వేల అమాత్యరత్నములు.

# శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారి వంశము.

బి. ఏ., బి. యల్., హైకోర్టు అడ్వకేటు.

వేదములకు వ్యాఖ్యానము సువర్ణాక్షరములతో తీర్చి దిద్దజేసిన శ్రీ విద్యారణ్య అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు స్టేట్ కౌన్సిల్ సభ్యులైయుండి, ప్రజలకు మహోపకారము లొనర్చియుండుటయే గాక ఆల్ ఇండియా కో-ఆపరేటివు సంఘముకు ప్రెసిడెంటుగాను, ప్రపంచ కో-ఆపరేటివు సంఘముకు భారతదేశ ప్రతినిధిగా జెనీవాలో జరిగిన అంతర్జాతీయ సహకార సమ్మేళనమునందు వెల్లివిరియునట్లు ఉపన్యాసములొసంగి, "ఉపన్యాస సార్వభౌమ" అని బిరుదము బడసిన అమాత్యరత్నము. కో-ఆపరేటివు సంఘము యొక్క ఉద్దేశ్యములు ఆ సంఘమువల్ల ప్రజలకు జేకూరెడి సదుపాయములనుగురించి నొక పత్రికను స్థాపింపజేయించి, సహకారసంఘములనుంచి దేశముకు ఉపకారములు జేయించియుండిన సహకార పితామహుండు.

శ్రీ వేమవరపు శేషగిరిరావు పంతులుగారు సంస్కృతము, వేదాంతశాస్త్రము, ఆంగ్లవిద్యలో ప్రతిభగాంచిన విజ్ఞానరత్నము. శ్రీ పంతులుగారు పి. డబ్లియు., శాఖలో ఓవర్‌సీయరు ఉద్యోగము స్వీకరించి ప్రజాదరణ, ప్రభుత్వపు ఘనత గాంచగల్గిన తపస్సంపన్నుడు. ప్రతి నిత్యము బ్రహ్మవిద్యా గ్రంథములను పఠించి, దేవుని పూజించుచుండెడి దేవాంశ సంభూతుడు. బీదసాదలను ఆదరించి దానధర్మములు జేయగలిగిన కీర్తిచంద్రుడు. సంపదసౌభాగ్యములచే విరాజిల్లు

సత్యచారిత్రుడు. శ్రీ శేషగిరిరావుపంతులుగారి ప్రథమ తన యుండైన శ్రీ వేమవరపు సీతారామయ్యపంతులుగారు కృష్ణా ఆనకట్టు సూపరింటెండెంటు యుద్యోగిగాయున్న రోజులలో కృష్ణకు మిక్కుటముగా వెల్లువలు రాగలిగి, కృష్ణా ఆనకట్టకు గండ్లు బడియుండగా, ఆ గండ్లు మరమ్మతు కొరకు పడవలు పైన సామానులు వేయించుకొని వెళ్ళి గండ్లవద్దజరిగియుండిన కట్టడములు వీక్షించుటను కృష్ణాగంగాజలమున శ్రీ పంతులు గారుదూకి శ్రీకాశీవిశ్వేశ్వరుని సన్నిధియందుగల గంగాజలము నందు తేలిన అమాత్యశిరోమణి. ప్రభుత్వఆజ్ఞ శిరసావహించిన ఆంధ్రమాత అనుంగతనయుడు. కృష్ణాఆనకట్ట గండ్లుచే కృష్ణా డెల్టా పంటలను నష్టములు వాటిల్లకుండా రక్షణజేసియుండిన పావనచారిత్రుడు. శ్రీ వేమవరపు సీతారామబ్రహ్మంగారు బి.ఏ., న్యాయవాదిగానేర్పడియుండి యశోధనము నార్జించు కొన్న ధర్మమూర్తి. సంపద సౌభాగ్యములచే విరాజిల్లెడి అమాత్యరత్నం. శ్రీ వేమవరపు సీతారామకృష్ణయ్యపంతులు గారు బి.ఏ., యల్.టి., హైస్కూల్ హెడ్ మాష్టరు. శ్రీ పంతులుగారు హెడ్ మాష్టరు పదవినలంకరించి, విద్యార్థులకు కడు నేర్పుచే విద్యలను బోధించి ఉత్తీర్ణులుగా విద్యార్థులను జేయగలిగిన అమాత్యశిరోమణి. శ్రీ వేమవరపు సుందర రావు పంతులుగారు రెవెన్యూడిపార్టుమెంటునందు ఉద్యోగము వహించి ప్రజలచేతను, ప్రభుత్వమువల్లను గౌరవప్రతిష్ఠలు గాంచియుండిన అమాత్యరత్నము. శ్రీ వేమవరపు సీతా రామయ్య పంతులుగారు విలేజి ఆఫీసరుఉద్యోగము స్వీకరించి ప్రతిభగాంచిన అమాత్య శేఖరుడు.

---

# శ్రీ పర్వతం నరసింహదీక్షితవర్యుని వంశము

విజయవాడ.



దేశముంగోలు సర్వత్రప్రాంతము పాలించిన అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ పర్వతం నరసింహదీక్షితవర్యుండు జన్మించెను. శ్రీ పంతులుగారు స్మార్తానుక్రమణికా అను గ్రంథమును రచించిన పండిత శిరోమణి. శ్రీ నరసింహదీక్షిత వర్యుని తనయుండైన శ్రీ పర్వతం లక్ష్మీనారాయణపంతులు గారు జ్యోతిష్య పండిత వరేణ్యుండు. ఐ. సి. యస్. ఆంగ్ల దొరలను, హైకోర్టు జడ్జీలను జాతకములను వ్రాసియుండిన ప్రజ్ఞాధురీణుండు. సంస్థానములయందు దివానుపదవి వహించిన కీర్తిచంద్రుడు. దాన ధర్మములుజేయు ధన్యచారిత్రుడు. శ్రీ పంతులుగారి మందిరము శ్రీదేవికిసలయమై భాగ్యలక్ష్మిచే విరాజిల్లగలుచున్నది. శ్రీ పర్వతం కామేశ్వరరావు పంతులు గారు పి. డబ్ల్యు. శాఖలో గొప్ప యుద్యోగము గైకొని ప్రజలచేతను, ప్రభుత్వమునుంచియు గౌరవప్రతిష్ఠలు గాంచి యుండిన ప్రతిభాశాలి. గొప్ప భూస్వామి. శ్రీ పర్వతం శివయ్యపంతులుగారు గొప్ప డాక్టరుగాయుండి కీర్తి ప్రతిష్ఠలు బడయగలిగిన అమాత్యరత్నము. శ్రీ పర్వతం హనుమంతరావు పంతులుగారు, యం. బి. బి. యస్., డాక్టరు, శ్రీ పంతులు గారు చిరుతప్రాయమునందే ఆంగ్లవిద్యలో ఘనతవహించి వైద్యశాస్త్రములో పట్టముగైకొన్న దేవాంశ సంభూతుడు. ఆర్తజనులకు ఆపద్బాంధవుడు. బీదలపాలిట కల్పవృక్షము.

శ్రీ పర్వతం లక్ష్మీనారాయణపంతులుగారు రెవిన్యూ డిపార్టుమెంటునందొక గొప్ప యుద్యోగముజేసి ప్రభుత్వము

వారిచేతను, ప్రజలచేతను గౌరవ ప్రతిష్ఠలు గాంచియుండిన అమాత్యరత్నము. గొప్పసౌధమును నిర్మింపజేయించి, సంపద సౌభాగ్యముచే విరాజిల్లు సజ్జనచారిత్రుడు. గొప్పభూస్వామి.

శ్రీ పర్వతం కుటుంబరావుపంతులుగారు రైల్వే శాఖలో యుద్యోగము వహించి ఘనతకెక్కిన అమాత్య చూడామణి.

శ్రీ పర్వతం చలపతిరావుపంతులుగారు విజయవాడ పురపాలక సంఘమునందు గొప్ప యుద్యోగిగాయుండి ప్రజాదరణ బడసిన అమాత్యరత్నము.

శ్రీ పర్వతం వీరభద్రశర్మగారు, బి. ఏ., బి. యల్. అడ్వకేటు, విజయవాడ. శ్రీ పంతులుగారు న్యాయవాదిగా నేర్పడి, యశోధనమునార్జించుకొన్న న్యాయశాస్త్రకోవిదుడు. దాన ధర్మములుజేయు ధన్యచారిత్రుడు. సంపద సౌభాగ్యములచే విరాజిల్లు అమాత్యరత్నము. శ్రీ పంతులుగారి తనయుండైన శ్రీ పర్వతం గోపాలకృష్ణమూర్తి పంతులుగారు, బి.ఏ., తరగతిలో వన్నెగాంచి ప్రభుత్వ సేల్సుటాక్సు ఉద్యోగము జేయుచుండిన కీర్తిచంద్రుడు.

శ్రీ పర్వతం రాధాకృష్ణమూర్తిపంతులుగారు తమ బాల్యమునుండియు, వేదశాస్త్రము అభ్యసించి, చతుర్వేదములలోను వేదాంత శాస్త్రమునందును, మరిపెక్కు ధర్మశాస్త్రములపట్లను పండితవర్యుండై ప్రతిభగాంచియుండిన అమాత్యచూడామణి. ఉపనయనము, వివాహము మొదలగు క్రతువులయందు వశిష్ఠపీఠము అలంకరించి ఆర్వేల అమాత్యశేఖరుల సంఘమువారిచేత పూజనీయుండైన వేదశాస్త్ర పండిత శిరోమణి.

# శ్రీ చోడవరపు దేవశ్రాజు పంతులుగారు

విజయవాడ.



చోళదేశముపాలించిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ చోడవరపు దేవశ్రాజు పంతులుగారు జన్మించిరి. శ్రీ దేవశ్రాజు పంతులుగారు గొప్ప కంట్రాక్టరుగాయుండి ప్రప్రథమమున కృష్ణా మండలములో కంకర రస్తాలను వేయించి కృష్ణామండలి ప్రజల అభినందనములు గైకొనగలిగిన ప్రజా బాంధవుడు యాబది అరువది వేల ధనమును వ్యయపరచి విజయవాడ పట్టణంబున శ్రీరామాలయ గోపుర ప్రాకారములను నిర్మింపజేయించియుండిన దేవాంశ సంభూతుడు. రెండు మూడు లక్షల ద్రవ్యముచే అన్నదాన సత్రమును స్థాపింపగలిగియుండి బీదసాదలకు ప్రతినిత్యము అన్న వస్త్రంబులు యొసంగియుండిన ధార్మిక చక్రవర్తి. దేవాలయ, అన్నదాన సత్రంబులు ఆ చంద్రార్కముగా విరాజిల్లబడుటకు ఈనాము భూముల వసతి నేర్పరచి అతిథిపరులను ఆదరించుచుండిన ఆర్వేల అమాత్యశిరోమణి. వేదపండితవర్యులకు ప్రతి వత్సరము పారితోషక పద్ధతి నేర్పరచి పండితులను పూజించుచుండిన పావన చారిత్రుడు. శ్రీ దేవశ్రాజు పంతులుగారి సౌధమునుగాంచిన శ్రీ ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి సౌభాగ్యలక్ష్మికి నిలయమైనట్లు గాంచగలుచున్నది.

శ్రీ చోడవరపు దేవశ్రాజు పంతులుగారియొక్క సతీ రత్నమగు శ్రీ అన్నపూర్ణదేవిగారు అతిథులను ఆదరించి, తమ జననీ జనకులు తమకు ధరింపజేసియుండిన అన్నపూర్ణదేవి నామమును సార్థకపర్చుకున్న పరమసాధ్వీమ తల్లి.

శ్రీ దేవరాజుపంతులుగారి తనయుండైన శ్రీ చోడవరపు విశ్వేశ్వరరావు పంతులుగారు, బి.ఏ., బి.యల్., అడ్వకేటు. న్యాయవాదిగాయుండి యశోధనముచే విరాజిల్లు అమాత్య రత్నము. తన జనకునిచే ప్రతిష్ఠింపబడిన ధర్మసంస్థలు వృద్ధి గాంచుటకు శ్రీ విశ్వేశ్వరరావుపంతులుగారు ప్రతినిత్యము తగు శ్రద్ధవహించి దీనులను ఆదరించుచుండిన దీనజన బాంధవుడు. సంపద సౌభాగ్యములచే వన్నెగాంచిన శ్రీ పురుషోత్తముడు.

శ్రీ చోడవరపు సుబ్బారావు పంతులుగారు, బి. ఏ., గుడివాడ. శ్రీ పంతులుగారు తమ చిరుతప్రాయమునుండియు, గుడివాడ పట్టణవాసులకు విశేష సేవజేసి పరపతి సంఘము లను, బ్యాంకులనుస్థాపింపజేయించియుండిన అమాత్యరత్నము. సద్గుణములచే ప్రకాశించుకీర్తిచంద్రుడు. సంపద సౌభాగ్యము బడయగలిగిన పుణ్యశాలి.

---

క॥ కాకేమి తన్ను దిట్టెనె
కోకిల తన కేమి ధనము కోకొమ్మనెనే
లోకము పగయగు బరుసని
వాకున జుట్టమగు మధుర వాక్యమువలనన్ ।

# రావుబహద్దరు శ్రీ లక్కరాజు లక్కరాజు పంతులుగారు

రెవిన్యూబోర్డు శక్రటరీ, విజయవాడ.

శ్రీరాముని తనయుండైన లవుని నామముచే నిర్మించబడిన లక్నో ప్రాంతము పాలించియుండిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ లక్కరాజు లక్కరాజు పంతులుగారుదయించగలిరి. శ్రీ లక్కరాజు పంతులుగారు మద్రాసు రాజధానిలో బి.ఏ., తరగతియందు ప్రథమశ్రేణి నలంకరించిన అమాత్యరత్నము. శ్రీ లక్కరాజు పంతులుగారు రెవిన్యూడిపార్టుమెంటునందు జిల్లా కలెక్టరు ఉద్యోగము వహించి ప్రజలను మహోపకారములను జేసియుండిన కీర్తిచంద్రుడు. శ్రీ పంతులుగారి అసమాన మేధాశక్తికి ఆంగ్ల గవర్నర్లు అచ్చెరువొంది మద్రాసు రెవిన్యూబోర్డు శక్రటరీపదవి శ్రీ లక్కరాజుపంతులుగారికి యొసంగియుండిరి. శ్రీ పంతులుగారు శక్రటరీ ఉద్యోగముస్వీకరించి, ప్రజలచేతను, ప్రభుత్వమువారిచేతను గౌరవప్రతిష్ఠలుగాంచియుండిన అమాత్యశిరోమణి. దీనులపట్ల శ్రీ పంతులుగారు నవనీత హృదయులై దీనజనులను రక్షణజేయించియుండిన దీనజన బాంధవుడు. వేలకువేలు ధనమును వ్యయబరచి దేవాలయ ప్రతిష్ఠను జేయించియుండిన దేవాంశసంభూతుడు. శ్రీ లక్కరాజు పంతులుగారి తనయుండైన శ్రీ లక్కరాజు నిరంజనరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్., అడ్వకేటు. శ్రీ నిరంజనరావు పంతులుగారు న్యాయవాదిగా నేర్పడి యశోధనము ఆర్జించుకొన్న అమాత్యచూడామణి. గోమాతల ప్రాణరక్షణకొరకు అపారమైన భక్తిశ్రద్ధలతో నిరంతరము సేవజేయు నిత్యకళ్యాణమూర్తి. సంపద సౌభాగ్యములతో విరాజిల్లు సత్యచారిత్రుడు.

# శ్రీ కుందేటి వెంకటసుబ్బారావు పంతులుగారు

తహశ్శీల్ దారు, కృష్ణా.

---

కుంతలదేశము పాలించి కీర్తిప్రతిష్ఠలు వహించిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ కుందేటి వెంకట సుబ్బారావు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు రెవిన్యూ డిపార్టుమెంటులో తహశ్శీల్ దారు ఉద్యోగమున్స్వీకరించి ప్రభుత్వమువారిమన్ననలను, ప్రజల ఆదరాభిమానములను గైకొనగలిగిన అమాత్యరత్నము. శ్రీ పంతులుగారు ఫస్టుక్లాసు మాజిస్ట్రేటు పీఠము అలంకరించియుండిన రోజులలో వ్యవసాయ డిపార్టుమెంటునందొక డిమాన్ స్ట్రేటరు యుద్యోగియొక్క ప్రవర్తన సక్రమముగా యుండలేదని ఆ డిమాన్ స్ట్రేటరు యుద్యోగిని జైలులో బెట్టించి ఆయనపైన క్రిమినల్ కేసుమోపి విచారణకొఱకు శ్రీ పంతులుగారి సమక్షమునకు జిల్లా ఆఫీసరు పంపియుండెను. ఆ డిమాన్ స్ట్రేటరుపైన మోపిన క్రిమినల్ కేసును సాకల్యముగ శ్రీ పంతులుగారు విచారణజేసి డిమాన్ స్ట్రేటరు యుద్యోగియొక్క చర్య అవినీతికరమైనదిగాదనియు, దుష్టప్రవర్తన యొనర్చి యుండలేదనియు, డిమాన్ స్ట్రేటరుపైన అక్రమకేసు పెట్టియుండిరని క్రిమినల్ కేసుకు జడ్జిమెంటు జెప్పి డిమాన్ స్ట్రేటరుకు ఉద్యోగము నిప్పించియుండిన ధీర పరాక్రమశాలి. దీనులను రక్షించెడి దీనజన బాంధవుడు. సాహసాది ధైర్య పరాక్రమములచే విరాజిల్లెడి అమాత్య శిరోమణి. సంపద సౌభాగ్యములతో ప్రకాశించు అమాత్య చూడామణి.

---

105

# శ్రీ లక్కరాజు సుబ్బారావు పంతులుగారు,

బి. ఏ., బి. యల్., అడ్వకేటు.

భూసంస్కరణ సంఘాధ్యక్షుడు, కాకినాడ.

లక్షలను, లక్షలు దేశసేవకు వ్యయబరచియుండిన అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ లక్కరాజు సుబ్బారావు పంతులుగారుదయించగల్గిరి. శ్రీ పంతులుగారు న్యాయవాదిగా నేర్పడి యశోధనము ఆర్జించుకొన్న అమాత్య రత్నము. మద్రాసు ప్రభుత్వము శ్రీ పంతులు గారిని సివిల్ న్యాయమూర్తి పీఠము వహింపవలసినదిగా కోరియుండినను, ఆ న్యాయమూర్తి పీఠము వలదని నిరాకరించిన భాగ్యశాలి. మద్రాసు కౌన్సిల్‌ను సభ్యులైయుండి ప్రజాసేవ జేసిన ప్రజాబాంధవుడు. కాకినాడ పురపాలక సంఘమును అధ్యక్షులైయుండి, కాకినాడ ప్రజలచే కీర్తిప్రతిష్ఠలు నొందగలిగిన కీర్తిచంద్రుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సేనేటు, సిండికేటు సభ్యులైయుండి, విద్యాసంస్థలను వృద్ధిజేసి ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరు పీఠము గైకొనగల్గిన అమాత్య శిరోమణి. ఆంధ్ర విశ్వవిద్యాలయము పట్ల శ్రీ పంతులుగారు యొనర్చియుండిన అమూల్యసేవకు గౌరవ పురస్సరంగా 'డాక్టరేట్' బిరుదమును ఆంధ్ర విశ్వవిద్యాలయ సభ్యులు శ్రీ పంతులుగారికి యొసంగియుండిరి. శ్రీ లక్కరాజు సుబ్బారావు పంతులుగారి యొక్క గౌరవ ప్రతిష్ఠలు ఆంధ్రప్రభుత్వము గుర్తెరింగి భూసంస్కరణ సంఘమునకు శ్రీ పంతులుగారిని అధ్యక్షుడుగా నేర్పడజేయగల్గినది. శ్రీ పంతులుగారు కాంగ్రెసు సభ్యులుగా యుండి దేశసేవజేసిన దేవాంశ సంభూతుడు. సంపద సౌభాగ్యముచే విరాజిల్లు అమాత్య చూడామణి.

# శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు పంతులుగారు

జిల్లా శిరస్తాదారు, బి. ఏ., కృష్ణా.

కర్ణాటదేశము పాలించి కవి సామ్రాట్టు శేఖరులుగా విరాజిల్లెడి అమాత్య శేఖరుల వంశమునందు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులు గారు సువర్ణ ఛాయచే ప్రకాసించు సౌందర్యమూర్తి. ఆంగ్ల విద్యలో బి.ఏ. తరగతియందు ఉత్తీర్ణుండైన ప్రతిభాశాలి. శ్రీ పంతులుగారు తమ చిరుత ప్రాయమునాడే రెవిన్యూ డిపార్టుమెంటునందు ఉద్యోగము స్వీకరించి కడు నేర్పుతో రెవిన్యూ వ్యవహారములను నిర్వహించిన మేధాసంపన్నుడు. మాజిస్ట్రేటు యుద్యోగము శ్రీ పంతులుగారు గైకొని దుష్ట చారిత్రులను గుర్తెరింగి ఆదుష్టులకు తగుశిక్షణ విధించియుండిన ధీరపరాక్రమశాలి. శ్రీ పంతులుగారు తాలూకా తహశ్శీల్ దారు పదవి వహించి ఇండ్లులేని బీద జనులకు ఇండ్ల స్థలము లను, భూమిలేని దీనులకు భూములను యొసంగియుండిన దీనజన బాంధవుండు. శ్రీ పంతులుగారియొక్క మహా నైపుణ్య ముగాంచి జిల్లా శిరస్తాదారు పీఠము శ్రీ పంతులుగారిని ఆకర్షించగల్గినది. శ్రీ పంతులుగారు జిల్లా శిరస్తాదారు పీఠ మలంకరించి. జిల్లాలోని వ్యవహారములను సుహృద్భావముతో వ్యవహరించి శుక్లపక్ష చంద్రునివలె నవయౌవనోత్సాహ ముతో ప్రభుత్వ మందిరంబులయందు మెరుపు ఛాయలచే విరాజిల్లు అమాత్య శిరోమణి సంపద. సౌభాగ్యములతో తులదూగు శ్రీ శేషశైల వాసుడు.

---

# శ్రీ కోన వెంకటరాయశర్మగారు

సాహిత్య విశారద, విమర్శ శిరోమణి.

---

కోసలదేశము పాలించి కీర్తి ప్రతిష్ఠలు గన్న అమాత్య శేఖరుల వంశమునందు, శ్రీ కోన వెంకటరాయశర్మగారు జన్మించిరి. శ్రీ శర్మగారు తమ చిఱుతప్రాయమునాడే దేశ దేశములయందు పర్యటనమొనర్చియుండి పెక్కు పుణ్యతీర్థంబులను సేవించగలిగి, ఆ పుణ్య తీర్థంబులయందుగల మహత్తర విశేషములను, అచ్చోటుల నిర్మితములై యుండిన గుడి గోపుర సత్ర ప్రాకారములపై లిఖించగలిగిన శిలా శాసనములను, హిందూ రాజులయొద్ద దండనాథులై యుండిన సచివోత్తముల సద్గుణ సచ్చరిత్రలను సౌవర్ణ పుష్పమాలికగా నిర్మించి, భావికాలపు యువకరత్నములకు భాగ్యము చేకూర్చిన విమర్శక అమాత్యశిరోమణి. భారతదేశ మహాసభలలో ఉపన్యాస పరంపరలచే ప్రజలను తన్మయత్వము గాంచజేయ గలిగెడి సాహిత్యవిశారద సార్వభౌముడు.

ఆంధ్ర కవితాసామ్రాజ్యమునందు అగ్రస్థానము అలంకరించిన అమాత్యచంద్రుడు. ప్రాచీనకాలమునాటి సద్రత్నముల చారిత్రలను, మణిముత్యాలసరముగా గూర్చి, నూతన వత్సర కానుకగా ప్రతి వత్సరము ఆంధ్రమాతను అలంకరింప జేయుచుండిన ఆర్వేల అమాత్యచూడామణి. విద్వత్ రత్నములచే విరాజిల్లెడి విద్వన్మహామహుడు. సంపద సౌభాగ్యములచే దులతూగు సజ్జన చారిత్రుడు.

---

# శ్రీనందివాడ శోభనాద్రిపంతులుగారి వంశము.

నందరాజ్యము పాలించబడిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ నందివాడ శోభనాద్రి పంతులుగారుద్భవించ గలిగిరి. శ్రీ పంతులుగారు విలేజి ఆఫీసరు ఉద్యోగము వహించి గృహములులేని ప్రజలకు గృహనిర్మాణములకొరకు స్థలములను భూములులేని బీదజనులకు భూములను అన్నము లేని ప్రజలకు అన్నదానము జేయించియుండిన పుణ్యశాలి. కుదరవల్లి గ్రామమునందు వేలకు వేలు ధనమును వ్యయబరచి శ్రీ సీతారామస్వామి దేవాలయమును, మంచినీళ్ల తటాకమున్ను నిర్మింపజేయించి దేవాలయ తటాకాది ప్రతిష్ఠలు ఆచంద్రార్కముగా విరాజిల్లబడుటకు యీనాము వసతుల నేర్పరచియుండిన దేవాంశ సంభూతుడు. శ్రీ పంతులుగారు నందివాడ గ్రామమునందు మంచినీళ్ల భావిని నిర్మింపజేసి ఆ గ్రామ ప్రజలకు ఆనందము జేకూర్చి యుండిన అమాత్య రత్నము. సంపదసౌభాగ్యములచే విరాజిల్లు పావనచారిత్రుడు. శ్రీ నందివాడ శోభనాద్రిపంతులుగారి తనయుండైన, శ్రీ నందివాడ కృష్ణారావు పంతులుగారుకూడా విలేజి ఆఫీసరు ఉద్యోగము వహించి తమ జనకునిచే ప్రతిష్ఠింపబడిన దేవాలయ తటాకాది ప్రతిష్ఠలపట్ల భక్తి శ్రద్ధలతో సేవజేయుచుండిన అమాత్య శిరోమణి. శ్రీ నందివాడ కృష్ణారావు పంతులుగారి పుత్రరత్నమైన శ్రీ నందివాడ వాసుదేవరావు పంతులుగారు బి. ఏ., బి. యల్., అడ్వకేటు. శ్రీ పంతులుగారు న్యాయవాదిగా నేర్పడి న్యాయస్థానములలో న్యాయమూర్తులపట్ల కడు నేర్పుతో వ్యవహరించి ప్రజలకు న్యాయము జేకూర్చ గలిగిన యువక చంద్రుడు. శ్రీ పంతులుగారికి ఆంగ్లభాష

వలెనే సంస్కృత భాషయందుగూడ, ప్రవీణతవహించిన, పండిత శిరోమణి. శ్రీ నందివాడ విశ్వేశ్వరరావుపంతులుగారు యం.బి., బి.యస్., డాక్టరు. శ్రీ పంతులుగారు చంద్రవంశ జోలు పద్మనేత్రుండై విద్యుత్కాంతి తేజముతో విరాజిల్లు సౌందర్యమూర్తి. గుడివాడ పురపాలక సంఘమునందు సభ్యత్వము శ్రీ పంతులుగారు వహించి, గుడివాడపట్టణమునకు నేత్రోత్సవముగొల్పు రాజబాటలు నిర్మింప జేయుగలిగించిన రాజనీతి కోవిదుడు. ఆరోగ్యహీనులైన ప్రజలకు ఔషధముల నిచ్చి ఆరోగ్యభాగ్యముల జేకూర్చెడి అమృతహస్తుడు. బీద సావలను ఆదరించెడి పుణ్యశాలి. శ్రీ నందివాడ ఫాలలోచన రావుపంతులుగారు, బి.ఎ.బి.యల్., అడ్వకేటు. శ్రీ పంతులు గారు న్యాయవాదిగాయుండి, న్యాయస్థానములలో ప్రజలకు న్యాయము జేకూర్చుటయందు అనర్గళప్రవాహముచే హైకోర్టు తీర్పులను, సుప్రీమ్‌కోర్టు జడ్జిమెంటులను న్యాయమూర్తులకు నివేదించి, న్యాయము జేయించెడి పురహూతుడు. శ్రీ నందివాడ హరినారాయణపంతులుగారు, బి.ఎ. శ్రీ పంతులు గారు వాయు విమానములను నడిపించుటయందు ప్రావీణ్యత వహించిన ప్రజ్ఞాధురీణుడు. శ్రీ నందివాడ వెంకటాచలం పంతులుగారు, ఆంగ్లభాషలోను, గుజరాతి, మార్వాడిభాషల యందును ప్రజ్ఞవహించి, నవయౌవనోత్సాహముతో లక్షల తరబడి వ్యాపారము జేయగల్గిన అమాత్యరత్నము. శ్రీ నందివాడ రాజగోపాలంపంతులుగారు బి.ఎ. న్యాయవాది శ్రీ పంతులుగారు చిరకాలమునుంచియు న్యాయవాదిగాయుండి యశోధనము ఆర్జించుకొన్న కీర్తిచంద్రుడు. సద్గుణములచే

నిర్మితమైనపావనచారిత్రుడు. ప్రతినిత్యము వేదశాస్త్రములుచే దేవమందిరమున దేవునిపూజించు దేవాంశసంభూతుడు. దాన ధర్మములు జేయు ధన్యచారిత్రుడు. శ్రీ రాజగోపాలంపంతులు గారి ప్రథమ తనయుండైన శ్రీ నందివాడ సుబ్బరాయశర్మ గారు, బి.ఏ., ప్రభుత్వ క్రిమినల్ వ్యవహారములను నిర్వహించుటకు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గాయుండి, గొప్ప ప్రతిభచే న్యాయస్థానముయందు వ్యవహరించు యువకరత్నము. శ్రీ నందివాడ చంద్రశేఖరరావుపంతులుగారు బి.ఏ.,బి.,యల్., భూమి తనఖా బ్యాంకు వ్యవహారములకు సలహాయొసంగెడి న్యాయశాస్త్రకోవిదుడు. శ్రీ నందివాడ సీతాపతిరావుపంతులు గారు, హోమియోపతి డాక్టరు. శ్రీ పంతులుగారు అతి నిపుణత్వముచే ప్రజలకు వైద్యముజేసి ప్రజాదరణ గాంచగలిగిన అమాత్యరత్నము. శ్రీనందివాడ లక్ష్మీపతిరావుపంతులుగారు విలేజి ఆఫీసరుగాయుండి, గౌరవప్రతిష్ఠలు గాంచియుండిన యువకచంద్రుడు. శ్రీ నందివాడ వాసుదేవపరబ్రహ్మమూర్తి పంతులుగారు పనపతిసంఘసభ్యులు, భూస్వామి. గౌరవప్రతిష్ఠలుగాంచిన అమాత్యరత్నము. శ్రీ నందివాడ సత్యనారాయణమూర్తిపంతులుగారు, మెకానికల్ ఇంజనీయరు పదవి వహించి, కీర్తి ప్రతిష్ఠలుగన్న అమాత్య శిరోమణి. శ్రీ నందివాడ ఉమామహేశ్వరరావుపంతులుగారు బి.ఏ., పరీక్షలో ఉత్తీర్ణులై ప్రతిభగాంచిన యువకరత్నము. శ్రీ నందివాడ వెంకటసుబ్బారావుపంతులుగారు, రైల్వే ఉద్యోగములో ప్రతిభగాంచిన ప్రజ్ఞాశాలి.

---

# శ్రీ బోడపాటి సుబ్బారావు పంతులుగారు

## పురపాలకసంఘ మాజీ మానేజరు, విజయవాడ.

భోజమహారాజు సంస్థానములో కవిసార్వభౌములుగా విరాజిల్లగలిగిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ బోడపాటి సుబ్బారావుపంతులుగారు జన్మించిరి. శ్రీపంతులుగారు ఆంగ్ల విద్య, సంస్కృతము, వేదాంతశాస్త్రములయందు పండిత పర్యాయముగా పన్నిగాంచియుండిన ప్రతిభాశాలి. శ్రీ పంతులు గారు పిన్ననాటనే రెవిన్యూడిపార్టుమెంటునందు ఉద్యోగము వహించి ప్రజలచేతను, ప్రభుత్వమువల్లను గౌరవప్రతిష్ఠలు గాంచియుండిన మహామేధానిధి. విజయవాడపురపాలక సంఘ మేనేజరుపదవి నిర్వహించుటకొరకు సమర్థతజెందిన ఉద్యోగిని పంపవలసినదిగా కృష్ణాజిల్లాకలెక్టరును విజయవాడ పురపాలక సంఘముకోరినమీదట, కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ బోడపాటి సుబ్బారావుపంతులుగారిని విజయవాడ పురపాలసంఘ మానేజరుగా పంపగల్గిరి. శ్రీ పంతులుగారు మేనేజరుపదవి స్వీకరించి పురపాలక సంఘమునందుగల అవినీతిచర్యలను గనుకొనబడి అదృశ్యములైయుండిన పన్నులబాకీలపట్టికలను శ్రీపంతులుగారి మేధాశక్తిచే లిఖించగలిగి విజయవాడ పురపాలకసంఘ ఆదాయమును ఇనుమడింప జేసియుండిన రాజకీయ దురంధరుడు. పురపాలకసంఘ యుద్యోగుల అక్రమచర్యలను అంతరింపజేసి పురపాలకసంఘ వ్యవహారములను పకడ్బందీతో నిర్వహింపగలిగిన అమాత్యశిరోమణి. ప్రతినిత్యము దేవునిపూజించెడి దేవాంశ సంభూతుడు. వేద పండితవర్యులకు పారితోషకము లొసంగి అన్నదానము జేయుచుండు పుణ్యశాలి. శ్రీ పంతులుగారి మందిరముగాంచిన సౌభాగ్యలక్ష్మిచే దులదూగుచున్నది.

౹౨

# శ్రీ పండ్రంగి సత్యనారాయణపంతులుగారి వంశము

పాండ్యదేశమును పాలించియుండిన అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ పండ్రంగి సత్యనారాయణ పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు, విలేజి ఆఫీసరు ఉద్యోగము స్వీకరించి ప్రజలకు మహోపకారములు జేసియుండిన కీర్తి చంద్రుడు. శ్రీ పండ్రంగి ఆనందరావు పంతులుగారు కో-ఆపరేటివు సంఘమునకు సూపర్ వైజరుగాయుండి ఆ కో-ఆపరేటివు సంఘ వ్యవహారములను కడునేర్పుతో వ్యవహరించి పేరెన్నిక గన్న అమాత్యరత్నము. శ్రీ పండ్రగి శ్రీరామమూర్తి పంతులుగారు, బి. ఏ., శ్రీ పంతులుగారు ఆంగ్లభాషలో పట్టభద్రుడై కాంగ్రెసునందు మేటిధీరుడై, కో-ఆపరేటివు సంఘము, గ్రామపంచాతీ సంఘమునకు అధ్యక్షులై ప్రజలకు అపారమైన సౌకర్యములు గలుగ జేసిన అమాత్యచూడామణి. బీదసాదలకు దానధర్మములు జేయు ధర్మమూర్తి. అన్న దానము జేయుచుండినపుణ్యశాలి. వేదపండితులకు పారితోష కము లొసంగు సాధుజనవరేణ్యుండు. వేయిబస్తాల ధాన్యము పండించు, యువకచంద్రుడు. పాఠశాల, గ్రంధాలయములను స్థాపింపజేయించి, విద్యాజ్ఞానము ప్రజలకు గాంచజేసిన విద్వ న్మహామహుడు. వందల తరబడి గోమాతలను పోషించు చుం డెడి పోషకకర్త. ప్రతినిత్యము దేవమందిరంబున, దేవుని పూజించే దేవాంశసంభూతుడు. శ్రీరామాలయ ప్రతిష్ఠజేసిన భక్తి శిరోమణి. సాహసాది సద్గుణములచే గౌరవ ప్రతిష్ఠలు గాంచిన అమాత్యరత్నము. అష్టైశ్వర్యములచే దులదూగు శ్రీ సూర్యవంశోద్ధారుండైన శ్రీశ్రీరామమూర్తియేననిస్ఫురించును.

# శ్రీ లక్కరాజు గోకర్ణేశ్వరరావు పంతులుగారు

ఆంధ్రదేశ దేవస్థాన ఆదర్శ ట్రస్టీ, గుడివాడ. (కృష్ణా)



గుడివాడ పట్టణంబునందుగల శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థాన ట్రస్టీపదవి శ్రీ లక్కరాజు గోకర్ణేశ్వరరావు పంతులుగారు వహించి, దేవుని గుడిగోపురప్రాకారముల పట్ల అహర్నిశానులు కంటికిఱెప్పవలె దేవుని సేవయే సర్వోత్కృష్టమని భావించి, దేవసౌధములను దేదీప్యమానముగా పండు వెన్నెలవలె మణిదీపతోరణంబులచే విరాజిల్ల జేసియుండిన భక్తాగ్రేశరుండు. జగధీశ్వరుండైన శ్రీ వేణుగోపాలునికి రత్న మకుట సింహాసనము, మణిరత్నముల గిరీటము, శంఖ, చక్ర గదాది దత్పాదపీఠము, ముఖమండప లావణ్యము నేత్రోత్సవముగొల్పు యా గర్భాలయ సౌందర్యము, వీనుల కింపగు స్ఫటికశిలా సభాసౌధము, సంపెంగ, పారుజాత, విరాజి ఫల పుష్ప వృక్షలతా గుల్మాదులుగూడిన దేవుని సగోవనము గాంచిన, భక్తవర్యుల హృదయములు సంభ్రమాశ్చర్యములు గొల్పుచుండును. దేవమందిరసమీపమున గ్రంథాలయమును శ్రీ పంతులుగారు స్థాపింపజేయించి పట్టణవాసులకు మహోపకారంగల్పించిన పావనచారిత్రుడు. పండితవర్యులచేత భగవత్ కథలను బోధింపజేయించి, ప్రజాసమూహములను ఆనందింప జేయుచుండిన పుణ్యశీలుడు. దేవుని ఆదాయము ఇనుమడింప జేసియుండిన మేటిధీరుడు. నిత్యకళ్యాణము పచ్చనితోరణంబులతో ప్రతినిత్యము దేవమందిరము కన్నులపండుగవలె గాంచ గల్గుచున్నది. శ్రీ పంతులుగారివంటి సుజనరత్నములు దేవాలయములకు ట్రస్టీ పదవి స్వీకరించిన యెడల దేవాలయములు భూలోక స్వర్గముగా ఆంధ్రదేశమున వెలయగల్గుచున్నవి.

124

# శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు

ఆంధ్రపత్రికాధిపతి, ఢిల్లీ రాజ్యసభ సభ్యుడు.

ఆణిముత్యాలబోలు ఆంధ్రదేశవార్తలను, సాహిత్య చంద్రికలుగొల్పు విదేశ రాజకీయములను, సౌవర్ణ పుష్ప మాలికవహించు రాజ్యసభల వృత్తాంతములను, ఆంధ్రదేశము నందవతరించిన శ్రీ రామచంద్రుని అమూల్య చారిత్రలను ఆంధ్రపత్రికయందు గూర్పింపజేయించి, ఆంధ్రమహాజనులకు అనుక్షణము ఆనందము యొసంగు జేయుచుండిన ఆంధ్రమాత అనుంగుతనయుడు. భారతిపత్రికను స్థాపించి భారతరమణులకు భాగ్యము జేగూర్చగలిగిన భాగ్యరత్నము. అమృతాంజనముచే అన్ని బాధలు అదృశ్యము జేయగలిగిన ఆదిశేషుడు. ఢిల్లీ రాజ్యసభకు శ్రీ పంతులుగారు సభ్యులైయుండి ప్రజావాంఛిత ములను శ్రీ పంతులుగారి పత్రికారాజమైన ఆంధ్రపత్రికచే ప్రభుత్వమును నెరుంగజేయుచుండిన పురహారుండు. తీగెలకు ఆధారము వృక్షమువలె వేలను వేలు ప్రజలు శ్రీ పంతులుగారి నీడను విశ్రమించుటకు వసతులు యొనర్చియుండిన ప్రజా బాంధవుడు. దేవాలయమును నిర్మింప జేయించియుండిన దేవాంశసంభూతుడు, వేదపండితులకు పారితోషకము లొసంగుచుండెడి ధర్మమూర్తి. పాఠశాలను స్థాపించిన అమాత్యరత్నము. శ్రీశివలెంక శంభుప్రసాదుపంతులుగారినామ విశేషము ఎట్లుగా నేర్పడగలిగినది. మేరు పర్వతవాసియైన శివుడు విహరించిన లంకకు శివలెంక యని నామము నేర్పడ గలిగినది. ఆ శివలెంకయందు శ్రీ శంభుప్రసాదు జన్మించి ఆంధ్రదేశ శిరోభూషణముగా విరాజిల్లగల్గుచుండెను.

# శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు

అడ్వొకేటు, దేవస్థాన స్కీము నిర్మాత.

వంగదేశము పాలించిన అమాత్యశేఖరుల వంశము నందు శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు న్యాయవాదిగా నేర్పడి ఆంధ్ర దేశములో కీర్తిప్రతిష్టలు వహించియుండిన విద్వన్మహామహుడు మద్రాసు రాజధానియందు గల దేవస్థానములకు నేర్పడి యుండిన యీనాము భూములపై వచ్చు ఆదాయములను దేవ కార్యములకు వినియోగించక దేవాలయ ధర్మకర్తలు, దేవ స్థాన అర్చకులు తమ తమ స్వంత ద్రవ్యములుగా వ్యయ బరచుకొనుచుండినియును అందువల్ల దేవస్థానములయందు గల దేవుని కళ్యాణ మహోత్సవములు ప్రతిసందుగలకు జరగవలసియుండిన దేవుని ఉత్సవాదులు దేవస్థాన మరమ్మ తులు మొదలగు కార్యములు సక్రమముగా జరుగక దేవస్థాన ములు బహుళపక్ష చంద్రునివలె గాంచుచున్నవనియు, దేవ స్థాన ఆస్థి అట్లు అన్యులపాలు యొనర్చబడక దేవాలయముల పట్ల వినియోగించుటకొరకు శ్రీ పంతులు గారు దీక్షవహించి మద్రాసు శాసనసభలలో శ్రీ పంతులుగారు చట్టములను ప్రభుత్వమువారిచేత శాంక్షను జేయించి దేవాదాయ ధన మును రక్షణ నేర్పరచ జేసియుండిన దేవాంశసంభూతుడు. దేవస్థానములు యున్నత స్థితివహించి శుక్లపక్ష చంద్రునివలె వృద్ధిగాంచుటకు దేవస్థాన స్కీము నిర్మాతయైన శ్రీ వల్లూరు సూర్యనారాయణరావుపంతులుగారు నిత్యస్మరణీయులు.

116

# శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు పంతులుగారు

బి. ఏ., కవిసార్వభౌమ.

---

కవిరత్నములచే విరాజిల్లు అమాత్యశేఖరుల వంశమున శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుపంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు ఆంగ్లవిద్యలో పట్టభద్రుడై సంస్కృతభాష యందు ప్రవీణతగాంచిన పండితశిరోమణి. నీలమేఘఛాయ గొల్పు పద్మనేత్రుండైన శ్రీ పంతులుగారు శ్రీకృష్ణ జన్మ స్థానము దర్శించి, శ్రీకృష్ణపరమాత్ముని ఆశీర్వాదములు బడయగలిగిన అమాత్యశిరోమణి. ఆంధ్ర కవితా సాహిత్య సామ్రాజ్యమున గౌరవ సత్కృతుల నందిన సర్వజ్ఞచక్రవర్తి. మౌక్తికమణులుగాంచు పెక్కుగ్రంథరాజములను శ్రీపంతులు గారు రచించి, ఆంధ్రదేశవాసులకు ఆనందము జేకూర్చిన కవి చంద్రుడు. బుద్ధిబలములో బృహస్పతికి తుల్యుండైన శ్రీ పంతులుగారు కృష్ణాపత్రికాధిపీఠము నైకొని ఆంధ్రదేశము యొక్క ఐశ్వర్యాభివృద్ధులు, ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము లభిం చకుండా ఆంధ్రేతరులు గల్పించిన కుతంత్రములు లోకమునకు జాటి ఆంధ్రరాష్ట్రసరిహద్దులయందు ఉక్కుకాంక్రీటు గోల్కు పునాదుల నిర్మింపజేసియుండిన శ్రీ శేషశైలవాసుడు. ప్రతి నిత్యము బీదసాదలకు అన్నదానముజేయుచుండెడి పుణ్యశాలి. గొప్పభూస్వామిగా నేర్పడియుండి కర్షకవృత్తిచే ప్రతిభగాంచిన భాగ్యశీలుడు.

శ్రీ పంతులుగారి సౌధము గాంచిన విద్యాలక్ష్మి, విజయలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి, సౌభాగ్యలక్ష్మిచే విరాజిల్లు కాటూరి శ్రీకవిసార్వభౌముడు.

---

# శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారు

## ఆంధ్రదేశ గ్రంథాలయ పితామహుడు.

ఆంధ్రదేశము పాలించిన, అమాత్యశేఖరుల వంశమునందు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారుజన్మించిరి శ్రీ పంతులుగారు నిరంతరము దేశసేవజేయు దీక్షావ్రతుండు విజయవాడపట్టణంబున శ్రీ రామమోహన గ్రంథాలయమును ప్రప్రథముగ స్థాపింపజేయగలిగి ఆ గ్రంథాలయాభివృద్ధికి కొన్ని వేలద్రవ్యము వ్యయబఱచియుండినత్యాగమూర్తి దేవాలయము యుండని గ్రామమున భుజించకూడదని, ధర్మశాస్త్రమునందు ఎట్లు లిఖించ గల్గియుండినదో అట్లుగానే గ్రంథాలయము స్థాపించనిగ్రామమున నివసించకూడదని, ఆంధ్రదేశమున శ్రీ పంతులుగారు పర్యటనయొనర్చి ప్రతి గ్రామమునందు ప్రతిపల్లెయందును గ్రంథాలయములను నెలకొల్పజేయించి ఆయా గ్రంథాలయములు ఆచంద్రార్కముగ విరాజిల్లబడుటకు 1860 సం॥ న 21 రు సొసైటీ ఆక్టుప్రకారం గ్రంథాలయ సంఘములను రిజిష్టరుజేయించియుండిన ఆంధ్రదేశ గ్రంథాలయ పితామహుడు. ప్రభుత్వమువారిచేత ప్రతి వత్సరము గ్రంథాలయములకు గ్రాంటుయొసంగుటకు శాంక్షన్ జేయించిన అమాత్యరత్నము. గ్రంథాలయ సర్వస్వమను పత్రికను శ్రీ పంతులుగారు స్థాపింపజేసియుండిన కీర్తిచంద్రుడు. శ్రీపంతులుగారి జన్మస్థానమైన అయ్యంకిగ్రామమునందు వేలకు వేలుధనము వ్యయబఱచి శ్రీచంద్రమౌళీశ్వరస్వామికిదేవాలయ ప్రతిష్ఠజేసియుండిన దేవాంశసంభూతుడు. ప్రతినిత్యము అన్నదానముజేయుటకు అన్నసత్రంబు స్థాపింపగలిగిన ధార్మికచక్రవర్తి దేవాలయ అన్నసత్రము ఆచంద్రార్కముగా విరాజిల్లుబడుటకు యీనామములనేర్పరచియుండిన ఆంధ్రమాత అనుంగుతనయుడు.

114

# శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మగారు

## శ్రీ మద్వాల్మీకి రామాయణోపన్యాస కేసరి. విజయవాడ.

నలునిదేశము పాలించిన అమాత్యశేఖరుల వంశమున శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మగారు జన్మించిరి. శ్రీశర్మగారు తమ చిరుతప్రాయమునాడే సంస్కృత భాషయందు విఖ్యాతి వహించి, విద్వజ్జనానందమునగన్న విద్యాసముద్రుడు. నీలమేఘ ఛాయగోల్పు జగన్మోహనుడైన శ్రీ సూర్యవంశరత్నమగు శ్రీరామచంద్రుని సచ్చరిత్రను శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారు ఉపన్యాస పరంపరలచే అంతులేని ఆనందబాష్పములను ప్రతి మానవునెడల నుదయించజేయగలిగి, ఆ దివ్యాకృతియైన శ్రీరామచంద్రుణ్ణి జనులనేత్రముల నెదుట గన్పట్టినట్టువలె ప్రదర్శించే డివసంతకోకిల. శ్రీ శర్మగారు శ్రీ మద్వాల్మీకి రామాయణ సంస్కృత శ్లోకములకు అర్థ తాత్పర్యములుదెల్పి మున్నెన్నడు కనివినని సంభ్రమాశ్చర్యములు జనులపట్ల గాంచజేసి ఆనంద బుష్పవర్షము అంతులేకుండా గురిపించి ప్రజలయొక్క శ్రద్ధాంజలులను, ధన కనక వస్తు పీతాంబర కానుకలను బడయగలిగి ఆంధ్రదేశమున శ్రీ నండూరు సుబ్రహ్మణ్య శర్మగారు పూజలొంద గల్గుచుండిరి. శ్రీ శర్మగారు ఆకాశవాణి విజయవాడ కేంద్రములో అఖండ వాగ్జాలముచే భారతాది ఉపన్యాసములు యొసంగెడి ఉపన్యాస కేసరి.

— —

119

# శ్రీపతి విశ్వపతి శర్మగారు

చతుర్వేదపండిత శిరోమణి, యలమర్రు. (కృష్ణా)

---

శిబిచక్రవర్తి యొక్క రాజ్యము పాలించిన అమాత్య శేఖరుల వంశమునందు శ్రీపతి విశ్వపతిశర్మగారుదయించగల్గిరి శ్రీ శర్మగారు ఇంద్రనీలమణుల ఛాయగోల్పు పద్మనేత్రుండై సంస్కృత భాషయందు, వేదశాస్త్రములోను మరి పెక్కు ధర్మ శాస్త్రములపట్లను పండిత బిరుదములను గాంచగల్గిన వేద వేదాంత చతుర్వేదపండిత శిరోమణి. వేలకువేలు ద్రవ్యము శ్రీ శర్మగారు వ్యయపరచి యలమర్రు గ్రామములో తటాకాది వనప్రతిష్ఠలను యొనర్చియుండిన పుణ్యాశాలి. వేద పండితవర్యులకు పారితోషికము లొసంగుచుండెడి పావన చారిత్రుడు. ప్రతినిత్యము అన్నదానముజేయు పుణ్యాశాలి. ఇండ్లులేని దీనులకు ఇండ్లస్థలములు యొసంగియుండిన దీనజన బాంధవుడు. భాగవత గ్రంధకర్త శ్రీ పోతనామాత్యునివలెనే శ్రీ విశ్వపతిశర్మగారుగూడ కర్షకవృత్తినేగైకొని ఆరేడువందల ధాన్యపుబస్తాల ధాన్యము పండించెడి భాగ్యశీలుడు. శ్రీ విశ్వపతిశర్మగారి మందిరముగాంచిన ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి విద్యాలక్ష్మి, విజయలక్ష్మి, సౌభాగ్యలక్ష్మి నివసించు సౌధమని స్ఫురించగలదు. శ్రీపతి విశ్వపతిశర్మగారి గృహనామ విశేషము ఎట్లు గాంచనగుచున్నది. శ్రీపతి అన లక్ష్మీదేవికి భర్త విష్ణువు. విశ్వపతి జగత్తుకు పతి రాజు. శ్రీ శర్మగారి జననీజనకులు శ్రీ శర్మగారిపట్ల లిఖింపజేసియుండిన భగవన్ నామముకు కళంకము రానివ్వకుండా గౌరవప్రతిష్ఠలచే విరాజిల్ల గల్గుచుండిరి.

---

120

# శ్రీ గోటేటి గంగాధర సుగుణభూష్ణరావు పంతులుగారు

## బి. ఏ., తహశ్శీల్ దారు, (కృష్ణా)

గౌడదేశము పాలించిన అమాత్యశేఖరుల వంశము నందు శ్రీ గోటేటి గంగాధరసుగుణభూష్ణరావు పంతులుగారు జన్మించిరి. శ్రీ పంతులుగారు ఆంగ్ల భాషలో బి.ఏ తరగతి యందు ఉత్తీర్ణుండైన యువకరత్నము. మెఱుపుకాంతి సౌందర్యముచే విరాజిల్లు ఫాలలోచనుడు. శ్రీపంతులుగారు రెవిన్యూ డిపార్టుమెంటునందు శ్రీ తహశ్శీల్ దారు ఉద్యోగము స్వీకరించి భూములు లేని ప్రజలకు భూములను గృహములు లేని జనులకు గృహములను నిర్మింపజేయించి అన్నదానము జేయుచుండిన పుణ్యశాలి. నవయౌవనోత్సాహముతో శ్రీ పంతులుగారు వ్యవహరింపగల్గుచూ ప్రజలచేతను ప్రభుత్వమువల్లను ఆదరాభిమానములను వహించియుండిన విద్వత్ శిరోమణి. కర్షక వృత్తిని శ్రీ పంతులుగారు ఆచరించి రెండు మూడు వందల ధాన్యపు బస్తాల ధాన్యము పండించు గొప్ప భూస్వామి. శ్రీ పంతులుగారి సౌధముగాంచిన ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి, విద్యాలక్ష్మి, విజయలక్ష్మి, సౌభాగ్యలక్ష్మి నివసించు మందిరమని స్ఫురించగలదు. శ్రీ పంతులుగారిపట్ల పంతులుగారి జననీజనకులు లిఖించగలిగిన నామమునకు కళంకము రానివ్వకుండా సార్థక మొనర్చుచుండెడి సత్యచారిత్రుడు.

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవిశిరోమణి

గుంటూరు మండలము.

121

బెంగుళూరు సంస్థానము పాలించిన అమాత్యశేఖరుల వంశము నందు శ్రీ బెల్లంకొండ రామరాయ కవిశిరోమణి జన్మించెను. శ్రీ రామరాయకవి అక్షరాభ్యాసమునాడు సంస్కృత నవనీతము శ్రీ సరస్వతీదేవి శ్రీ రామరాయ కవివర్యునకు ప్రీతితో నొసంగెను. శ్రీ రామరాయ కవిరత్నము గ్రంథ రచనకు గడంగి, చిలుక గోరువంక పలుకులవలె ఇంపుగూర్చెడి సువర్ణ ఉద్గ్రంథములను వందలకొలది ఆంధ్రమాతచే ధరింపజేయించి జయకిరీటము ఆంధ్రమాత శిరమునకు అలంకరింపజేసియుండిన విద్వద్రాజచూడామణి. సంస్కృతవిద్యార్థులకు అన్నవస్త్రము లొసంగి వందలకొలది విద్యార్థులను కవివర్యులనుగా నొనర్చి యుండిన ధార్మిక చక్రవర్తి. శ్రీ రామరాయ కవిచంద్రుడు రచించిన పలువిధములైన గ్రంథరాజములు వజ్రమాణిక్యాల కంటె మిన్నలై, సర్వ శోభాయమానముచే ప్రకాశింపబడుట యేగాక శ్రీ రామరాయ కవిశిరోమణి ఆంధ్రదేశమున కరుణా సముద్రుడై ధ్రువునికైవడి గగనమండలమున కవితా పూర్ణ చంద్రుడుగా విరాజిల్ల గల్గుచుండెను.

తే॥ గీ॥ కాలమను వాలుకాభూమి గానుపించు
నంతరించిన పెద్దల యడుగు జాడ
లవియు వారి చరిత్రంబు లరసి వినుచు
నున్న నాత్మ జీవితముల నుద్ధరింప
తలపు వలపును ధైర్యంబు కలుగు మనకు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REHB08 I 170 |
| పుస్తకం పేరు | (శ్రీ) శ్రీదేవ్వల |
| తారీఖు | 10/1/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 122, 123 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | Lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |